సంస్థాపకులు
కీ॥శే॥ వి. వి. రాఘవయ్య

మేనేజింగ్ ఎడిటర్
శ్రీమతి వి. లీలావతి
రాఘవయ్య



మే 1981

సంపుటి 19 | సంచిక 4

విషయసూచిక



ఈ నెల నవలానుబంధం

# జీవితం సశేషం

రచన: దాశరధి విజయలక్ష్మి

ముఖ చిత్రం : కమల్‌హాసన్, చివరి అట్టమీద: జీనత్ అమన్

జ్యోతి, 1-8-4/1/1 చిక్కడపల్లి, హైదరాబాదు 500 020
సంవత్సర చందా (ప్రత్యేక సంచికతో సహా) రు. 50

పందెం : యాభై లక్షలు సంపాదించటం
పెట్టుబడి : ఏబది పైసలు
గడువు : అయిదు సంవత్సరాలు
బహుమతి : పదహారేళ్ళ అమ్మాయి
షరతులు : 1 న్యాయపరిధిలో
2 చట్టానికి లోబడి



జూన్ 1981 సంచికలో ప్రారంభం!




పై షరతులకు
వప్పుకోవటమైనది!

యండమూరి వీరేంద్రనాథ్

డబ్బు డబ్బు డబ్బు సీరియల్

CHANDRA

# రిజర్వేషన్‌ల వేడి



# తొలిమాట

రిజర్వేషన్ వ్యతిరేక ఉద్యమం మొదలయింది. దేశంలోని వివిధ ప్రాంతాలకి అల్లుకు పోతున్న సమస్యని చక్కగా పోషిస్తున్నారు కొందరు। ఉన్న కులాలు రెండే—డబ్బున్నవారూ, లేనివారూ। "వెనకబడ్డ" వారికి ఆర్థిక బలాన్నిచ్చే విషయం ప్రభుత్వం మరిచిపోతోంది.....ముందు అది ఏర్పడితే కులాల ప్రసక్తి ఇంతగా పెరిగి పోషించబడుతుందా?। విద్యా విధానంలో రాని మార్పు అలానే వుంది—ఈ రిజర్వేషన్‌ల వల్ల విద్యాలయాల్లో ఏం జరుగుతుందో తెలీని విషయం కాదు। విద్యాలయాల్లో వున్న ఈ రిజర్వేషన్ ఉద్యోగాలలోనూ విషమంగా తయారవుతోంది. ఎంతో అర్హత వున్నవారు ఎంత నిష్ప్రయోజనంగా వుండిపోయారో కనిపిస్తోంది....

ఆర్థిక, సామాజిక, విద్యా విషయాలలో అభివృద్ధి అనేది కాలేజీస్థాయి నించీ, ఉద్యోగ స్థాయిల నించీ కాదు—నర్సరీ విద్యనుంచీ "వెనకబడిన" వారి పోషణ, విద్యా బాధ్యతలు ప్రభుత్వం తీసుకోవాలి. 30 సం॥ నుంచీ ప్రభుత్వం ఈ పని చేస్తే, శక్తి సామర్థ్యాలకి తగినట్టు రిజర్వేషన్ వారికి ఉద్యోగాలు ఏర్పడేవి. అప్పటి బలహీన వర్గాలవారి కడుపుమంట ఇప్పటి ఉన్నత వర్గాల వారికి వచ్చింది।



లోపలి పేజీల్లో 'హాస్య కథల పోటీ' వివరాలున్నాయి....చూడండి....




## కేవలం కల్పితం!

'జ్యోతి' సంపాదకులకు —

నమస్తే

ఏప్రిల్ నెల "జ్యోతి"లో ప్రచురించబడిన నా రచన "ఐ లవ్ యు" మా ఆఫీసులో కొన్ని అపార్థాలకూ, అపోహలకూ దారితీయటం జరిగింది. కథలో వాతావరణ చిత్రణ కోసం నేను ఉపయోగించుకున్న కొన్ని డిపార్టుమెంట్లు, సెక్షన్ల పేర్లు, క్యాంటీను వాతావరణం ఈ అపోహలకు, అపార్థాలకూ కారణమైవుండొచ్చు. ఈ కథలోని పాత్రలు, సంఘటనలు కేవలం కల్పితమనీ, ఎవరినీ ఉద్దేశించి రాసినవి కావనీ ఒకటి రెండు వర్ణనలు ఎవరికైనా పోలివుంటే అది కేవలం యాదృచ్ఛికమేననీ, "యామిని" వేదమూర్తుల వంటి వ్యక్తులు మా ఆఫీసులో ఎవరూ లేరనీ మనవి చేసుకుంటున్నాను.

రచయితగా నాకెదురైన ఇబ్బందిని అర్థం చేసుకుని సహృదయంతో ఈ లేఖను వెంటనే సంపాదకులు ప్రచురిస్తారని ఆశిస్తున్నాను.

— జి. సి. జీవి

మద్రాసు

## 'క.వి' గారూ!

'కవి' గారూ! మీ "విశ్వనాధవారు వ్రాయని కథ" చదివేను అద్భుతంగా వుంది నా రచయిత మిత్రుల్లోనే విశ్వనాథ పుస్తకాలు చదవనివారున్నారు. వారికి "పులిమ్రుగ్గు" వంటి పుస్తకాల్లోని కొన్ని సంఘటనలు ఆయన శైలిలోనే సరదాకి చెప్పేవాణ్ణి. మీ కథ చదివి హాయిగా నవ్వుకున్నాను. ముగింపు మరీ బావుంది విశ్వనాధలోని కఠినపదాలు లేకుండా మీరు చాలా చక్కగా అనుకరించారు మీ శ్రమ ఫలించింది. అయితే, విశ్వనాథ పుస్తకాలు చదవనివారికి మీ కథ ఎలా వుంటుందో మరి! మీకూ, ఇలాంటి కథను ప్రచురించిన 'జ్యోతి'కీ నా హృదయపూర్వక అభినందనలు.

కె. వి. యస్. వర్మ,

విశాఖపట్టణం.

## బానే వున్నాయి!

1981 ఏప్రిల్ "జ్యోతి"లో విస్వనాధవారిని అనుకరిస్తూ కవిగారు వ్రాసిన విశ్వనాధ వారు వ్రాయని కథ చాలా బాగుంది. కీ॥ శే॥ విశ్వనాధను అనుకరించటంలో "కవి"గారు నూటికి నూరుపాళ్ళు కృతకృత్యులయ్యారు. ఆయన శ్రీ విశ్వనాధ బ్రతికి వుండగా ఈ కథను

## దేవిప్రియకు ఫ్రీవర్స్ ఫ్రంట్ బహుమతి

ఫ్రీవర్స్ ఫ్రంట్ వారు ఏటేటా యిచ్చే బహుమతిని ఈ ఏడాది పాత్రికేయుడూ, కవి శ్రీ దేవిప్రియ గెల్చుకున్నారు. ఆయన రచించిన "అమ్మచెట్టు" అనే కవితా సంపుటికి బహుమతి లభించింది. నిర్ణేతలు డా॥ సి. నారాయణరెడ్డి, శ్రీయుతులు పురాణం సుబ్రహ్మణ్యశర్మ, కె. రామోహన్‌రాయ్ గార్లు.

1967లో ఈ బహుమతి ప్రారంభమైన తర్వాత, విజేతలలో దేవిప్రియ పదకొండవ వారు. ఇటీవలి వరకు వీరు హైదరాబాదులో జ్యోతి మాసపత్రికలో పనిచేశారు. లోగడ "ప్రజాతంత్ర" వారపత్రికలోనూ, ఆంధ్రజ్యోతి దినపత్రిక విలేఖరిగానూ పనిచేశారు. దేవిప్రియ 1960లలో వచ్చిన పైగంబర కవులలో ఒకరు. కవిత్వంలో సాంఘిక, రాజకీయ విషయాల మీద చక్కని సెటైర్ రాయగల సమర్థులు.

శ్రీ అమ్మంగి వేణుగోపాల్ రచించిన "మిణుగురు" కావ్యానికి ద్వితీయ స్థానం లభించింది. నిర్ణేతల దృష్టిలో మంచివిగా తోచిన యితర కావ్యాలు: సముద్రం నాపేరు (గుంటూరు శేషేంద్రశర్మ), చలనం (విహారి), ఆకలి నృత్యం (శీలా సుభద్రాదేవి), చంద్రజ్యోతి (శశికాంత శాతకర్ణి).

ప్రచురణకు పంపి వుంచే ఈ కథకు ఏం పేరు పెట్టేవారో తెలుసుకోవాలని వుంది. ఇకపోతే మిగిలిన కథల్లో "ఆకుపచ్చలాగు"లో పార్వతి మరణం "మనిషిలో దేవుడు"లో డాక్టరుగారి మరణం ముందే తెలిసి పోవటంతో ఆ కథలు చప్పగా వున్నాయి. ఈ నెల కథల్లో ప్రత్యేకత గలది శ్రీ పులికంటి కృష్ణారెడ్డిగారి "కుక్కపిల్ల". ఇందులో కథా, కథనంకూడా ఎంతో బాగున్నాయి. "అప్పన్న" కథ చివరలో కాంతమ్మ సానుభూతితో పాటు పాఠకులందరి సానుభూతి పుష్కలంగా దోచుకున్నాడు. ఇంత మంచి కథ వ్రాసిన రచయిత అభినందనీయుడు.

వక్కలంక రామారావు
మానేపల్లె

## అచ్చం విశ్వనాథ వారే

"జ్యోతి" ఏప్రిల్ సంచికలో విశ్వనాథ వారు వ్రాయని కథ చదివాను. నిజానికి అది విశ్వనాథ వారు వ్రాసిన కథ అని నమ్మేట్లుగా వుంది. అసలు రచయిత పేరు చెప్పకుండా, ఆ కథ కథ మాదిరిగా ప్రచురించి, ఇది ఏ రచయిత వ్రాసినదో చెప్పుకోమంటే, నూటికి నూరుగురు పాఠకులూ "విశ్వనాథవారి రచన" అనే మీకు వ్రాస్తారని నా నమ్మకం. జూనియర్ "విశ్వనాథ" వారికి నా హార్దిక శుభాకాంక్షలు.

ఐ. వి. యస్. అచ్యుతపల్లి
రాజోలు



ఇటీవల తెనాలి రెడ్ క్రాస్ భవనంలో జరిగిన జంట గ్రంథాల ఆవిష్కరణ సందర్భంగా గ్రంథకర్త డాక్టర్ పోతుకూచి వెంకటేశ్వర్లుగారికి ఘనసన్మానం జరిగింది. జంట గ్రంథాలను ఆవిష్కరిస్తున్న డాక్టర్ కె. వి. కృష్ణకుమారి శ్రీ శాయిశ్రీ, మధ్యన గ్రంథకర్త డాక్టర్ పోతుకూచి వెంకటేశ్వర్లుగారు.

---

'సంతోష్‌నగర్ వెల్‌ఫేర్ అసోసియేషన్' వారు ఇటీవల తమ 3వ వార్షికోత్సవం రవీంద్ర భారతిలో జరుపుకున్నారు. డా॥ దాశరథి అధ్యక్షుడుగా, ముఖ్య అతిథిగా జస్టిస్ శ్రీ పి. వి. చౌదరి వేదిక నలంకరించారు. మంత్రి గౌ॥ పి. జనార్ధనరెడ్డి సావనీర్ విడుదల చేశారు. డా॥ నేరెళ్ళ వేణుమాధవ్ మిమిక్రీ కార్యక్రమం, హైదరాబాద్ ఫిలిమ్ టాలెంట్ గిల్డ్ వారిచే సాంస్కృతిక కార్యక్రమం జరిగింది.





# హాస్య కథల పోటీ

## మొత్తం మూడు బహుమతులు

| ప్రథమ బహుమతి | ద్వితీయ బహుమతి | తృతీయ బహుమతి |
|---|---|---|
| రు. **500** | రు. **300** | రు. **200** |

### నిబంధనలు గమనించండి :

1. కథలు 12 పేజీలు మించకుండా ఉండాలి. (సుమారు పేజీకి 3 లైన్లతో 12 పేజీల పుల్‌స్కేపు పేజీలు మించకుండా.)
2. అనువాదాలూ, అనుసరణలూ అంగీకరించబడవు. రచనలు తమ స్వంతమేననే హామీ పత్రాన్ని విధిగా పంపాలి. రచనలు కేవలం హాస్య ప్రధానంగా ఉండాలి.
3. ముఖ్యగమనిక : రచయితలు తమ చిరునామాను కథవున్న పేజీలలోగానీ, ఆ పేజీల వెనుకగానీ కాకుండా, మరో కాగితంపై వ్రాసి జతచేయాలి.
4. రచయితలు కలం పేరుతోబాటు తమ అసలు పేరును విధిగా తెలియచేయాలి.
5. ప్రచురణార్హంగాని కథలు తిప్పి పంపగోరువారు కథలతోపాటు తగినన్ని తపాలా బిళ్ళలంటించిన స్వంత చిరునామాగల కవరు జతచేసి పంపాలి.
6. పోటీకి రచనలు పంపే కవర్లపై 'జ్యోతి హాస్యకథల పోటీకి' అని విధిగా రాయాలి.
7. పోటీలో బహుమతి పొందని కథలలో ప్రచురణార్హమైనవాటిని ప్రచురణకు స్వీకరించే హక్కు మాకుంటుంది.
8. పోటీ విషయంగా జ్యోతి సంపాదకులదే తుది నిర్ణయం.

**రచనలు పంపేందుకు ఆఖరు తేదీ 31 మే 1981**



అసోసియేషన్ ఆఫ్ స్టేట్ రోడ్ ట్రాన్స్‌పోర్టు అండర్‌టేకింగ్స్ వారు ఇటీవల హైదరాబాదులో నిర్వహించిన కేరమ్స్ పోటీలో విజేత శ్రీ డి. లాల్ (ఎ.పి. యస్ ఆర్.టి.సి.)కి వ్యక్తిగత ఛాంపియన్‌షిప్ బహుమతినందిస్తున్న ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ వైస్ ఛైర్మన్ అండ్ జనరల్ మేనేజర్ శ్రీ పి. యస్. రామమోహనరావుగారు.

---

ప్రముఖ సాంస్కృతిక సంస్థ "కళాసాగర్" డా॥ వెంపటి చినసత్యంను సన్మానించిన సందర్భంలో సెంట్రల్ ఎక్సైజు కలక్టర్ శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాధరావు, హైదరాబాద్ కూచిపూడి ఆర్ట్ అకాడెమీ ప్రిన్సిపాలు కుమారి శోభానాయుడు, కావలి జవహర్‌భారతి ఆచార్య శ్రీ ఎస్వీ భుజంగరాయశర్మ.



## పిల్లల కథా!

దాదాపు ఎనిమిది సంవత్సరాల క్రితం విశ్వనాథ వారికి జ్ఞానపీఠం బహుమతి లభించిందని విన్నాక వారి అనితరసాధ్యమైన శైలిని అనుకరించాలనే బుద్ధిపుట్టి వ్రాసిన "కవి" గారి 'విశ్వనాథ వారు వ్రాయనికథ'లో ఏ మాత్రం విశ్వనాథ వారి శైలిని రచయిత వ్రాయలేకపోయారని వ్రాయటానికి విచారిస్తున్నాను. ఎవరి శైలి వాళ్ళదే. ఎవరి ప్రత్యేకత వారిదే. విశ్వనాథ వారి శైలిని అనుకరించినంత మాత్రాన 'కవి' గారికి విశ్వనాథ వారిపేరు వస్తుందా? పై పెచ్చు చెడ్డపేరు వస్తుంది. "ఏకవీర", "వేయిపడగలు" చదవినవారి కందరికీ తెలుస్తుంది.

ఇనుకవట్ల ఇజ్రాయెల్,
కాకినాడ



ఢిల్లీలో తెలుగు కళాజ్యోతి వారి "సంధ్యా ఛాయ" నాటక ప్రదర్శన జరిగింది.

సీరియల్

# సౌభాగ్యలత

ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి రావు శాస్త్రి

(గత సంచిక తరువాయి)

## 7

రఘురామయ్య కంగారుగా చూస్తూ, నుదుటిని పై కండువాతో ఒత్తుకున్నాడు. విషయాన్ని తేలికగా తీసుకున్నట్టుగా నవ్వే ప్రయత్నం చేశాడు కానీ పెదవులు సత్యాగ్రహం చేశాయి.

చిన్నబోయిన వదనంతో చదరంగం పావులను తదేకంగా చూస్తూన్న అతడినుండి ఓ దీర్ఘ నిశ్వాసం వెలువడింది.

"వెళ్లొస్తాను రఘురామయ్యా! నే నెన్నుకుంటే ఏం లాభంలే, కొడుకు పెళ్లి చూసే అదృష్టరేఖ నా ముఖాన వున్నదో లేదో!"

నిర్లిప్తంగా అనేసి నిష్క్రమిస్తూన్న కోటయ్యనే పరిశీలనగా చూస్తూ అన్నాడు రఘురామయ్య వకుళతో!

"కోటయ్యకు శశి ధోరణి తెలిసిపోయినట్లుంది మనచేత కాదనిపించు కోకముందే తానే అందమైన అభ్యంతరం తెలిపాడు. గొప్ప ఆత్మాభిమాని, శ్రీమంత్ కూడ అతడికి తగిన బిడ్డ! ఆ ఆత్మాభిమానంముందు ఎంతటి ఐశ్వర్యమైనా దిగదుడుపే!"

"ఔను నాన్నా! ఇటువంటి విషయాలు అస్పష్టంగా ఏళ్ళతరబడి సాగే కంటే తక్షణం తేలిపోవడం అవసరం"

విస్మయంగా చూశాడు రఘురామయ్య.

"నాన్నా.... ...."

"చెప్పమ్మా, ఏమిటా సందేహం?"

'నన్ను కోప్పడకండి నాన్నా అక్క ఇక శ్రీమంత్‌ను చేసుకోదు!"

"ఆఁ?"

"అక్క స్నేహితురాలు జలజ మీకు తెలుసు"

"అయితే?"

"వాళ్లు బాగా ధనవంతులు. జలజ అన్న మహేష్ పెద్ద కంట్రాక్టరు. అక్కకూ అతడికీ స్నేహం"

రఘురామయ్య ముఖకవళికలు త్వరత్వరగా మారిపోయాయి. నిత్యం ప్రశాంతత తాండవించే ఆ కనులలో రౌద్రం తావు చేసుకొన్నది.

"స్నేహం అంటే?"

వకుళ జంకింది

"చెప్పమ్మా, నీకెందుకు భయం?"

"బహుశ అతడినే చేసుకుంటుందేమో? శ్రీమంత్‌ను మాత్రం చేసుకోనని ఖచ్చితంగా చెప్పింది."

"ఎప్పుడు?"

"శుభలేఖ చించివేసి మీతో పెంకెగా మాట్లాడినపుడు అక్కకు నేను నచ్చచెప్ప ప్రయత్నించాను ఫలితంగా ఈ చేదునిజం తెలిసింది-అక్క డైరీలో అతడి ఫోటో కూడా వుంది!"

రఘురామయ్య ఏమీ వ్యాఖ్యానించకపోయినా అతడి ఎదలోని నిరాశ కనులలో ప్రతిబింబించింది.

"ఎందుకిలా మారిపోయింది శశి?" తనలో తాను గొణిగినట్టు అన్నాడు.

కోటయ్యగారికి ఇవన్నీ తెలిసే అలా గుంభనంగా మాట్లాడారేమోనని పించుతోంది నాన్నా నేను చెప్పినట్టు మాత్రం అక్కకు తెలియనీయకండి

"శ్రీమంత్‌ను వదలుకోవడమా?" బాధగా కణతలు రుద్దుకున్నాడు రఘురామయ్య. "ఛఛ, కోటయ్యతో అన్ని ప్రగల్భాలు పలికానే-ఇక ఎలా అతడి ముఖం చూసేది? తన లేమిని ఈ విధంగా అపహసించానని అపోహ పడతాడేమో! పరిపరివిధాల వాపోసాగాడు రఘురామయ్య.

జాలిగా చూస్తున్న వకుళ మనసులో అనేక భావాలు అల్లిబిల్లిగా అల్లుకోసాగాయి.

అంతలో ఆమెను ఒక్కసారిగా భయం ఆవహించింది. 'నాన్నగారే తట్టుకోలేకుండా వున్నారే! ఇక ఈ విషయాన్ని శ్రీమంత్ ఎలా తీసుకుంటాడు?'

భయంతో సుడిగాలిలో చిగురుటాకులా కంపించింది ఆమె సున్నిత హృదయం!

"నిజమే, నాన్నగారికే ఏమిటి? నాకెంత బాధగా వున్నది! ఈ యింటిలో— మా మనసులలో ఒక భాగంగా—కాదు సర్వంగా అల్లుకుపోయాడు శ్రీమంత్. అతడిని వదులుకొన గలమా?

## 8

"శశీ! సూటిగా మాట్లాడడం నా కలవాటు." అంటూ సరాసరి తన గది లోనికి వచ్చి, ఒక సోఫాలో కూర్చున్న శ్రీమంత్‌ను విస్మయంతోనూ, తడబాటు తోనూ చూసింది శశిరేఖ. వాగ్బంధనమైనట్లు మాటలాడ లేక పోతూన్నది శ్రీమంత్ చొరవ చూచి.

"ఏమిటలా చూస్తున్నావ్? నాతో మాటలాడటానికి కూడా ఓపిక కావాలా? నాలుగడుగులు నడువలేని సుకుమారివని తెలుసుకున్నాను. నాలుగు మాటలు మాట్లాడితే ఏమీ ఆయాసం, అవమానం వుండవను కుంటాను?"

సూటిగా చూస్తూ, ఖండితంగా మాటలాడుతూన్న శ్రీమంత్ మాటలలోని నిగూడార్థాన్ని శశిరేఖ గమనించక పోలేదు.

అతడు ఇటో యిటో తేల్చుకోడానికే వచ్చాడనే విషయాన్ని స్పష్టంగా అతడి చూపుల తీవ్రతే వ్యక్తీకరిస్తోంది.

డ్రెస్సింగ్ టేబిల్‌పై సామాను యిటు అటు సర్దుతూ కొంత వ్యవధి కల్పించుకున్నది.

శ్రీమంత్ అసహనంగా కదులుతున్నాడు.

శశిరేఖ వైఖరి నిర్లక్ష్యంగా వున్నది.

ఒకరి ముఖ కవళికలు మరొకరికి దర్పణంలోవలె స్పష్టంగా కనబడు తున్నాయి.

"ఎక్కడికో వెళ్తున్నావను కుంటాను?"

శ్రీమంత్ ప్రశ్నకు ఇటు తిరగకనే "ఔను" అన్నది.

"మహేష్‌ను కలియడానికా?"

శశిరేఖ ఒక్కసారిగా కంగారు పడినా పైకి ప్రదర్శించలేదు.

"ఔను, మహేష్ దగ్గరికే," అన్నది బింకంగా.

సహజంగా తనలో వున్న పెంకెతనం నేడెందుకో అతడిని చూచి జంకు తున్నది.

"శశీ! ఎవరీ మహేష్?"

నిర్లక్ష్యంగా దృష్టిని తన చేతి అందమైన గోళ్ళ మీదికి త్రిప్పింది.

"అతడితో ఎప్పటి నుండి నీకు స్నేహం?"

చురుకుగా చూచింది శశిరేఖ.

"నీకు నా విషయాలలో ఆరాలు తీసే అధికారం ఎప్పటినుండి?"

ఈ సవాలు విన్న శ్రీమంత్ నిటారుగా అయ్యాడు.




లేచి నిలబడి గిరుక్కున తిరిగి ద్వారం వైపు నడిచాడు.

అక్కడే ఆగి కొద్దిగా వెనుదిరిగి చూస్తూ అన్నాడు:

నీ విషయాలూ, నీవూ నాకు అవసరంపని యిప్పటికైనా స్పష్టంగా చెప్పావు థాంక్స్ కానీ యింతగా అవమానించడం దేనికి? ఏనాడో చెప్ప వలసింది ఈ డొంక తిరుగుళ్ళన్నీ యెందుకు?

"శ్రీమంత్!"

రోషంగా లేచి చకచకా అతడి వెంటకు నడచి వచ్చింది శశిరేఖ.

"శ్రీమంత్! ఈనాడు కాదు-ఏనాడు మాత్రం నీ వెవరివని నీకు ఏమైనా నేను చెప్పాలి?"

దిగ్భ్రాంతితో నిరుత్తరుడై నిలచాడు శ్రీమంత్.

"శ్రీమంత్! నువ్వెవరు-నేనెవరినని అసలు ఏనాడైనా ఆలోచించుకున్నావా? నా విషయాలలో అనవసర కుతూహలం చూపడం నీ అవివేకం; నీ అంతస్థేమిటో బేరీజు వేసుకోకనే నాపై ఆశలు పెంచుకోవడం నీ అజ్ఞానం. నువ్వు నా తండ్రి ప్రాపకంలో పెరిగినవాడివి, అంతే. అందని మానిపండును ఆశించకు!"

అవమాన బాణాలు తగిలిన శ్రీమంత్ వదనం అరుణిమ దాల్చింది.

క్రోధ వివశతతో కొంత సేపు మాటలే కరువైనాయి.

తాను మునుపు ఎరుగని క్రొత్తరూపాన్ని చూస్తూన్నట్లు శశిరేఖను నఖశిఖ పర్యంతం నిరసనగా చూశాడు.

గంభీరంగా అన్నాడు!

"శశీ! నీ తండ్రి ప్రాపకంలో బ్రతుకుతున్నాననే అపోహను వదలిపెట్టు. అనేకమందికి అప్పులు యిచ్చే అలవాటున్నది నీ తండ్రికి. నేనూ అప్పుగా తీసు కున్నాను; దఫదఫాలుగా తీర్చుతున్నాను. మీరు ఏవిధంగానూ నాకు సహాయం చేసినట్లు గర్వించ నవసరంలేదు అంతస్తు అంటావా-అది కేవలం డబ్బుతోనే

వస్తుందని నేననుకోను. ఇక నా అజ్ఞానమంటావా-ఔను-అజ్ఞానినే, ఆడది చీరలు మార్చినట్లే మనసులోని మరులను కూడ మార్చగలదని తెలియని అజ్ఞానిని. నీ విషయాలలో నా జోక్యమూ, కుతూహలమూ ఎప్పటినుండి మొద లైనాయో బహుశా నువ్వు మరచినంత తేలికగా నీ మనసు విస్మరించదు. ఒక్క సారి మనసును వెనక్కు తిప్పిచూడు!"

అంటూనే గబగబా నడచి పోయాడు.

ఆవేశంలో వున్న అతడు గుమ్మం ప్రక్కన వున్న వకుళను ఒక్కసారి చూచి, మాట్లాడకుండా వెళ్లిపోయాడు.

అతడి వెనుకనే వెలుపలికి వచ్చిన శశి ఆగ్రహమంతా వకుళపై కురిసింది.

"ఏం, గూఢచారి పనులు ప్రారంభించావా?"

"ఇంకా లేదులేకానీ- నీవుమాత్రం ఒక రత్నాన్ని రాయిగా భావించి విసరి వేస్తున్నావు"

"కావాలంటే ఆ రాయిని నీ నెత్తికెత్తుకో, నా అభ్యంతరం ఏమీ లేదు. నాకు అనవసర సలహాలూ, కాపలాలూ మాత్రం అక్కరలేదు."

"నువ్వు మైకంలో వున్నావు అక్కా. శ్రీమంత్ మాటలు అక్షరాలానిజం. అతడూ నీవూ గతంలో ఎంత స్నేహంగా వుండేవారో నీ మనసును అడుగు. నాలుకమీద మాట మారినంత త్వరగా మనసుపై పడిన ముద్రలు మాసిపోవు"

నిరసన ప్రకటించి విష్క్రమిస్తున్న చెల్లెలినే చూస్తూ నిలబడింది శశిరేఖ.

అప్రయత్నంగానే ఆమె మనోఫలకంపై పాత చిత్రాలు చిందులు వేయ సాగాయి.

o o o o

శ్రీమంత్, శారదలతో కోటయ్య దంపతులు ఆ వూరు వచ్చేనాటికి శశిరేఖ ఊహ తెలియనిదేమీ కాదు.

శ్రీమంత్ కంటే ఆమె రెండు సంవత్సరాలు మాత్రమే చిన్న.

అతి చురుకూ, చలాకీ అయిన ఆ యిరువురికీ అనతి కాలంలోనే స్నేహం బలపడింది.

ఆ స్నేహం ఎంత గట్టిదంటే—తరగతిలో సహాధ్యాయులంతా ఈర్ష్య పడేటంత!

"శ్రీమంత్ ఈరోజు స్కూలు వద్దులే, ఊరి చివర తోటలో మామిడి పిందెలు కొట్టుకొద్దాం!" అంటూ శశిరేఖ జారీచేసిన ఆజ్ఞను శ్రీమంత్ తు. చ. తప్పక పాటించేవాడు.

తమకు ఎన్నితోటలున్నా ఇతరుల తోటలలో పూలూ, పళ్లూ దొంగిలించి వారిచేత తిట్లుతిని మరలా తిట్టడం శశిరేఖకు చిన్ననాడు మహా సరదాగా వుండేది. అందుకు శ్రీమంత్‌ను తన కుడి భుజంగా ఎన్నుకొనేది.

"ఏయ్ కొంటీ, ఎందుకా పాడుపనులు? మనకు లేదా ఏమన్నానా? ఎందుకా దొంగతనాలు?" శ్రీమంత్ ఆరిందాలాగా మందలించేవాడు.

"అదికాదు శ్రీమంత్! చూడు ఆ తోటమాలి అదమరచి ఎంతహాయిగా నిద్రపోతున్నాడో! వాడిప్పుడెలా గింజుకుంటాడో చూడు!" అంటూ కోసిన కాయ ఆఖరుది అతడిపైన గిరవాటు పెట్టి పరుగులంకించుకునేది.

పడుతూలేస్తూ తోటమాలి తనను పట్టుకో వస్తూంటే అందకుండా పరుగెడుతూ పకపకలాడి వినోదించేది. అతడిని యజమాని ఏమేమి తిడతాడో ఊహించుకుని ఆనందించేది శశిరేఖ.

అదంతా అమానుషంగా తోచినా, ఆమె స్నేహాన్ని వదులుకోలేని శ్రీమంత్ అయిష్టంగానే ఆమెతో సహకరించే వాడు. పదేళ్ళ ప్రాయంలో చిలిపి చేశారు. పదహారేళ్ళ ప్రాయంలో కలిసి సినిమాలు చూసీ, పుస్తకాలు చదివీ చర్చించుకొనే వారు.

"అబ్బ! దేవదాసు పిరికి వాడైతే పోనీయ్. ఆ పార్వతి కంత అసమర్థతేం? నేనే పార్వతినైతే దేవదాసు నాన్న నోరు మూసి దేవదాసుకే తాళిగట్టి వుండేదాన్ని!" అన్నది శశిరేఖ దేవదాసు చిత్రం చూసి.

శ్రీమంత్ ఆగకుండా అయిదు నిమిషాలు నవ్వాడు ఆ రోజు.

"ఔను, నువ్వు అంతటి దానవే!" అన్నాడు ఇరవై ఏళ్ళ ప్రాయంలో జీవితాన్ని, జీవన సత్యాలనూ గూర్చి చర్చించుకొనే వారు, వారి చదువులూ, కళాశాలలూ వేరైనా ఒక ప్రేమ కావ్యంలో నాయికా, నాయకులుగానీ, తమకు తెలిసిన ఎవరైనాగానీ ఆత్మహత్య చేసుకోవడం అనే దాన్ని గర్హించేది శశిరేఖ.

"ఛీ ఛీ, పిరికి వాళ్లు, అఫ్ట్రాల్ — ఒక్క వ్యక్తి ప్రేమ కోసం జీవితాన్నే అంతం చేసుకోవడమా? నేను హర్షించను."

"అంతకు మించి దారి లేకుంటే ఏం చేస్తారు పాపం?" శ్రీమంత్ ప్రశ్నలో సమర్థన వుండేది.

"ఛ ఛ, ఏదో దారి కల్పించుకోవాలి కానీ చావే దారి అని వ్రాసి వున్నదా?" శశిరేఖ రెచ్చిపోయేది వాదనలో.

అప్పుడప్పుడూ వారి వాదోప వాదాలలో పాల్గొనే వయసు వచ్చింది వకుళకు.

"సంఘం బాధలు భరించలేని వారికి ఆత్మహత్య మినహా ఏది దారి?" అన్నది వకుళ, వారితో చదువుకొనే అమ్మాయి ఒకామే ఒక ప్రేమ కలాపంలో యిరుక్కొని ఆత్మహత్య చేసుకొన్నది.

ఆ ఉదంతం కథలు కథలుగా వ్యాపించింది ఆ రోజు కళాశాల మూసి వేశారు.

ఆ విషయమే స్నేహితులు చర్చించుకుంటున్నారు. వకుళ వాదనను ఈసడించింది శశిరేఖ.

"ఇటువంటి అమ్మమ్మ కబుర్లు చెప్పకు ఈ తరంలో, సంఘం ఏమిటి? నువ్వూ నేనే సంఘం. ఒక మగవాడి కోసం చావడమేమిటి? అఫ్ట్రాల్ వాడూ మనవంటి వాడే!" అంటూ శశిరేఖ అనుకోకుండా శ్రీమంత్ వదనం లోనికి

చూచింది.

శశిరేఖ ధోరణిని ఆ దింపలేని అభిజాత్యం ఏదో కన్పించిందామెకు అతడి నేత్రాలలో.

"అక్రమానికీ అన్యాయానికీ ఆడా మగా భేదంలేదు శశీ, ఎవరి పరిస్థితులను బట్టి వారి సమస్యా పరిష్కారం జరుగుతుంది గానీ మన చర్చలు వ్యర్థం" అన్నాడు ప్రక్క ముళ్ళ కంచెపై చిక్కుకున్న ఆమె పమిట కొంగును సుతారంగా ఆ ముళ్ళనుండి విడదీస్తూ.

అంతవరకూ దూరదూరంగా స్నేహితులు గానే వున్న ఆ యిరివురిలోనూ ఆ సంఘటన లలితాతి లలితమైన మధుర భావాలను రేకెత్తించింది.

శ్రీమంత్ కనులలోనికి చూస్తూ, శశిరేఖ తన వాదనను విస్మరించింది.

పరధ్యానంగా నడుస్తూ తూలి ప్రక్క కాల్వలో పడబోయిన ఆమెను ఒక్క అడుగు వెనుకనే వస్తూన్న శ్రీమంత్ బలమైన హస్తం పడకుండా ఆపి నిలబెట్టింది

శశిరేఖ మేను జలదరించింది, మనసు పరవశించింది. "మగవాడి ఆధిక్యత ఏమిటి" అనే తన మొండివాదన ఆ క్షణంలో గుర్తురాలేదు. తమ నడుమ స్నేహమే కాక మరేమో కూడా వున్నదనే భావం కలిగింది "ఇరువురిలోనూ ప్రప్రథమంగా. (సశేషం)

# లిమ్కాతో అనుక్షణం సేదతీరును మరుక్షణం

లిమ్కా, ఆమైన్ నిమ్మ మరియు సిసిలియన్ నిమ్మపళ్ళ పుల్లని, తీయని రుచి. సువాసనల సంగమం బాక్టీరియా రహిత పానీయం మీ దాహం తీర్చడానికి దీనిలో 'ఐసోటానిక్' లవణాలున్నాయి విటమిన్ సి కూడా. కాలరీలు కావాలనుకునేవారు ఇతర పానీయాలకు బదులు లిమ్కానే ఎంచుకుంటారు

లిమ్కా మీ ఇంటిల్లిపాదినీ రంజింపజేసే అన్ని వేళలా మీ సేదతీర్చే పానీయం—ఇంటా, బయటా కూడా



ఈతకొట్టి పైకొచ్చాకా,
ఇష్టంతో తాగేది లిమ్కా.
ఈత కొట్టాక సేదతీర్చే గుటక



బాక్సింగ్ వీరులు మెచ్చేది,
లిమ్కా వారికి నచ్చేది.
పోటీ తర్వాత సేదతీర్చే పానీయం.



సైకిలు తొక్కే సమయం,
లిమ్కా పానం రసమయం.
షికారు తర్వాత సేదతీర్చే పానీయం.



పిక్నిక్ సరదా కిలకిలలు
లిమ్కా నవ్వుల గలగలలు.
బయటకు వెళ్లినప్పుడు సేదతీర్చే పానీయం.



కేంటీన కబుర్ల సమయంలో,
మెదులును లిమ్కా మదిలో.
కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ తాగే పానీయం







SADEUS/PE/L-2-81

జ్యోతి కథల పోటీలో ప్రత్యేక బహుమతి రు. 116 పొందిన కథ!

# జీవన స్పర్శ

వి. రాజారామమోహనరావు

వినపడే చప్పుళ్ళే వాడికి ప్రపంచం. స్పర్శే వాడికి జీవితం. భూమిని అడుగుల్తోటి, పరిసరాల్ని ఊహలతోటి కొలుస్తూ వొచ్చి కూచున్నాడు.

ఆడది కాబట్టి బాగా జనం తిరిగే రోడ్డవటం వల్ల పొద్దెక్కే వరకు పడుకునుండటం బావుండదు కాబట్టి సావిత్రి అప్పటికే నిద్ర లేచి అరుగుచివర కూచుంది. నిద్రలేవగానే పక్కనే వున్న హోటల్ కెళ్ళి టీ తాగింది. తాగేసి, యింకేం చెయ్యటానికీ చేతిలో డబ్బుల్లేక తిరిగి అరుగు దగ్గర కొచ్చి దిక్కులు చూస్తూ కూచుంది. సరిగ్గా అప్పుడే సావిత్రి కళ్ళల్లో పడ్డాడు వాడు.

చేతి కర్రతో నేలని తాటిస్తూ గాలిలో వెతుకుతూ చిన్న కుర్రాడిలా అడుగు వేసుకుంటూ వస్తున్న వాణ్ణి చిత్రంగా చూసింది సావిత్రి. కర్ర సాయంతో నడిచే ఎందరో గుడ్డాళ్ళని అంతకు ముందు చూసింది సావిత్రి. కానీ వీడంత నెమ్మదిగా అడుగులో అడుగు వేస్తున్నట్టు నడిచే వాళ్ళని చూళ్ళేదు.

ఒకవేపు హోటల్, మరోవేపు గుడికి వెళ్ళే సందు, యించుమించు యీ రెండింటిమధ్య వుంది వాడు కూచున్న చోటు. సర్దుకూచున్నాక, తన ముందు వో తువ్వాలు పరిచి అడుక్కునే కార్యక్రమం మొదలెట్టాడు. ధర్మం చెయ్యమని రకరకాలుగా వాడు అంటున్న మాటలు సావిత్రికి వినిపిస్తున్నాయి.

మరీ అంత రంగు లేకపోయినా నలుపుకాదు ... యిరవై దరిదాపులో వయసు.... ఆరోగ్యంగా కుదురుగా వున్న వాడివేపు ఓ పావుగంట అలాగే చూసింది సావిత్రి.

ఊరు కొత్త, ఎటువెళ్ళాలో ఏం చెయ్యాలో తోచని అయోమయం, బద్ధకంగా వున్న వొళ్ళు.... అందుకే అలా తీరుబడిగా వాణ్ణి చూస్తూ కూచుంది. మరో గంట గడిచేటప్పటికి దరిదాపు పది పదిహేనుమంది వాడికి ధర్మం చేయటం చూసింది. సావిత్రి. 'ఐదు పైసలు, పదిపైసలు వేసినా యించు

మించు రూపాయి....గంట గడవకుండా రూపాయి సంపాదన'.... అనుకుంది సావిత్రి. అలా అనుకోగానే సావిత్రి గుండెలదిరాయి.

వాడి ముందు నుంచి యిటూ, అటూ తిరుగుతున్న జనానికి లోటేం లేకుండా వుంది. సాధారణంగా అందరు అడుక్కునే వాళ్ళలా, మాసిన గుడ్డల్తోటి, మట్టి వొంటితో కాకుండా శుభ్రంగా వుతికిన బట్టలు, నీటుగా చక్కగా వున్న వాడి తీరూ. ....చదువు, సంధ్యా లేనోణ్ని, కాయ కష్టం చెయ్యలేనోణ్ని, రెండు కళ్లూ లేని కబోధిని.. అని వాడు మెత్తగా, దీనంగా అడుక్కునే పద్ధతి సావిత్రి కళ్ళ బడ్డాయి.

"అమ్మో-కళ్లు లేకపోయినా....దిట్టమైనోడే....మంచి సెంటరు ....దానికి తోడు మంచి లయగా అడుక్కుంటున్నాడు" అనుకుంది సావిత్రి. అలా అనుకున్న మరుక్షణం దాని ఆలోచన వేగం పెరిగింది. గడిచిన, గడుస్తున్న జీవితపు నికృష్టపు అనుభవాలు, జ్ఞాపకాలు మనసులో మెదిలాయి. వీటన్నింటికన్నా కడుపులో కరకర మంటున్న ఆకలి వొక్కసారిగా వొళ్లు విరుచుకున్నట్టయింది. కూచున్న చోట్నించి లేచి వాడి వేపు నడిచింది.

తన పక్కకి వచ్చి ఆగాక సావిత్రి అడుగుల చప్పుడు గుర్తించాడు వాడు. వో క్షణం చెవులు రిక్కించుకుని చూశాడు. అడుగు అటుగానీ, ఇటుగానీ పడిన సవ్వడి వినిపించలేదు. అనుమానంగా ముందు డబ్బులున్న తువ్వాలు మీద గాలిలో చేతులు అటూ, ఇటూ వూపి వెదికాడు. అది చూసి కిసుక్కున నవ్వింది సావిత్రి. నవ్వి.... "నువ్వడుక్కున ఆ డబ్బులేం ఎత్తుకుపోన్లే.." అంది వాడి పక్కనే కూచుంటూ. ఆ తర్వాత ఇద్దరికీ మాటకలవటానికి,

## రచయిత పరిచయం



రచయిత ఆంధ్ర పాఠకులకు చిర పరిచితులు. ఆయన అనేక కథలూ, వ్యాసాలూ రాశారు. 'వరద' వంటి కథల మొదలు ధారాప్రవాహంగా వివిధ పత్రికలలో ప్రచురితమవుతున్నాయి. కథల పోటీల్లో ఎన్నోసార్లు బహుమతు లందుకొన్నారు.

నివాసం : హైదరాబాదు.

రైల్వేలో ఉద్యోగం.

లిటరేచ రన్నా, మ్యూజిక్ అన్నా ఎంతో అభిమానం అంటారాయన.



కబుర్లు చెప్పుకోటానికి ఎంతో సేపు పట్టలేదు. ఆ తర్వాత వాడి పక్క నుంచి కదల్లేదు సావిత్రి. వాడితోటి కలిసే టిఫిన్ తింది, టీ తాగింది.... భోం చేసింది. సాయంత్రం చీకటిపడే [illegible] పల వాడికెన్నో కబుర్లు చెప్పింది.వాడి నోట ఎన్నో కబుర్లు చెప్పించుకుంది. తన [illegible]తనం; తన వయసు వాడికి కనిపించేలా ఎన్నోసార్లు నవ్వింది.

[illegible] సావిత్రి వాడి ఎన్నో విషయాలడిగింది. "నువ్వు పుట్టుగుడ్డాడివా?" అంది. "మొదట్నించీ ఈ వూళ్ళోనే వుంటున్నావా? అంది. "నాలాగే నీకూ ఎవరూ లేరు కదూ" అంది. అలా అంటునే మధ్య మధ్యలో తన గురించి కూడా సావిత్రి కొన్ని విషయాలు చెప్పింది వాడికి.... ఒంటరి ఆడదా"న్నంది-నీలాగే నాదీ [illegible]డుక్కునే బతుకంది. "మగాళ్ళని నమ్మకూడ" దంది. వెంటనే "మంచి మగాళ్ళని




న ్మాలి అంది ... వయసు చెడ్డ
ంవి. అందులో తనలాంటి అదు
ష్టనే ఆడది వయసులో వుండటంలో
చాలా కష్టం వుందంది .... యిలా
మైత్తానికి వాడికి చెప్పాల్సిందంతా
చెప్పి, వాడిచేత చెప్పించుకోవాల్సిందం
తా చెప్పించుకుంది. ఆఖరికి రాత్రివాడు
అక్కణ్ణించి లేచి వెళ్ళేటప్పుడు తన చే
యి అందించి ముందుకు నడిపించింది.
చీకటి బ్రతుక్కి చివరివెలుగులాఅందిన
సావిత్రి మెత్తటి చేతిని నిమురుతూ
వాడూ మనస్ఫూర్తిగా.... "ఈరాత్రికి
ఒక్కదానివి ఎక్కడ పెడతావు....నాతో
పాటే వచ్చేయి...." అన్నాడు. సావిత్రి
నవ్వుతుంది. పైకి నవ్వింది, నవ్వి
చేతిని మరి త గట్టిగా పట్టుకు ది.

o o o

హోటల్లో కెళ్ళి రొట్టెలు, మాంసం
కూరా కొనుక్కొని అక్కడికి చేరాడు
అక్కడికి చేరాక పరికించి చుటూ

చూసింది సావిత్రి. పాడడిపోయిన యింటివసారా అది. అసలే ఆ యిల్లున్న సందు చిన్నది. దానికితోడు సందుకి ఆఖరి యిల్లది. అంతా చూసి అనుకూలంగానే వుందనుకుంది. చాలారోజుల తర్వాత కక్కుర్తి లేకుండా కడుపునిండా రొట్టెలు, వాటికి తోడు రుచిగా కూర తింది. సావిత్రి తిన్న కొద్దీ పెట్టాడు వాడు.

అనుభవం అదే అయినా అనుభూతి వేరుగావుంది అంతకు ముందు ఆడవాళ్ళతో కొన్ని కిరాయి అనుభవాలున్నా వాడికి సావిత్రితో ఈ అనుభవం కొత్తగావుంది. తనచోట్లో, తనది అనిపించిన రాత్రిలో ఏ కిరాయి బేరాలు లేకుండా ఏ తొందరా లేకుండా గడుస్తున్న సమయం గొప్పగా అనిపించింది. వొదులుకోలేని పెన్నిధిలా దూరం చేసుకోకూడదని నిధిలా ఆ రాత్ర తా సావిత్రి వొంటిని అంటి పెట్టుకునే గడిపాడు. తనకి బుద్ధి తెలిసిం తర్వాత అంతటి గొప్ప స్పర్శని, సుఖాన్ని ఎప్పుడూ పొందలేదనిపించింది వాడికి.

రోజులు గడుస్తున్నాయి. వారం, పది రోజులు, పదిహేను రోజులు గడిచాయి. ఏర్పడ్డ సంబంధం, వాడికీ, సావిత్రికీ యిద్దరికీ సుఖంగానే వుంది.

ఆకలి బాధలేదు. తిండి వెతుకులాట తప్పింది. చేతులు చాచి వొళ్ళప్పగిచి రోజు గడుపుకునే నరకం తప్పింది.... అది సావిత్రి సుఖం.

చీకటిగా .. చీకటిలో వొంటరిగా.... కేవలం అడుక్కుని, తిండితిని రోజు గడిపే యంత్రంలా బతికేవాడికి తోడు. తన పిలుపుకి, ఆశలకి బదులు పలికే మనిషితోడు దొరకటం ఏదో వెలుగు ప్రపంచం దొరికినట్టయింది .... ఇరవై ఏళ్ళవాడి వయసుకి జీవితం దొరికినట్టుంది. అదీ వాడి సుఖం.

ఆ సుఖం యిద్దరికీ తృప్తిగానే వున్నా, రోజులు బాగానే గడుస్తున్నా యిద్దరూ అంతటితో ఆగలేదు. వాడికి కొత్త కోరికలు, కొత్త ఊహలు పుట్టుకొచ్చాయి. అలాగే సావిత్రికి కొత్త బుద్ధులు పుట్టుకొచ్చాయి. దానికి కారణం....

ం ం ం

అప్పుడే నిద్దర్లోకి జారుకున్న సావిత్రి పక్కన పడుకున్న వాడు 'అలా చేస్తే ఎలా వుంటుంది'... అనుకున్నాడు. బాగానే వుంటుందనిపించింది. మనసులోనే గుణించుకుని వోసారి లెక్కవేసుకున్నాడు .. దాచుకున్న సొమ్ము దరిదాపు వెయ్యి రూపాయలు....దానితో ఏదో ఒకటి చెయ్యొచ్చు. సావిత్రికి కళ్లున్నాయి... తనలాగ గుడ్డిది కాదు . తెలివుంది.... ఏ చిన్న యాపారం చేసుకున్నా యిద్దరి పొట్టలు గడిచిపోతాయి. యిలా పొద్దున్నించి రాత్రిదాకా అడుక్కునే ఎదవ బతుకు మానేయచ్చు ' అనుకున్నాడు తనలో తానే.

"ఏంటీ దరిద్రబ్బతుకు అందరి దయాధర్మాలమీద పొట్టపోసుకుంటూ యిలా ఎన్నాళ్ళు బతికినా ఏంటిలాబం" అన్న బాధ వాడిలో ఎప్పణ్ణించో వుంది. అయినా మరో దారేం లేని తన గుడ్డితనాన్ని జ్ఞాపకం చేసుకుని తనకి తనే

రోజు రోజుకీ ఈ రాజకీయాలమీద
నమ్మకం పోతోందోయ్... నాయుడూ!




నచ్చచెప్పుకునేవాడు వాడికి జ్ఞానం తెలిసిం దగ్గర్నుంచీ అడుక్కుంటూనే వున్నాడు. రకరకాల స్థలాల్లో, అనేక రకాలమంది మధ్య బతికాడు. రోజులో మూడొంతులు పైగా అడుక్కునే బతుకుల ఆరాటం వాడికి తెలుసు ...తిండి ... ఆకలిమంట ఆర్పుకోగలిగే నాలుగు డబ్బులు .. పెద్దాచిన్నా లేదు.... ఆడా మగా లేదు . ఎవడి తాపత్రయం వాడికి ముఖ్యం. పసితనంలో పెద్ద ముష్టాళ్ళు తనని కొట్టి అడుక్కున్న నాలుగు డబ్బులు లాక్కుపోటం ఎన్నోసార్లు వాడి అనుభవంలో వుంది. బతకటమే తప్ప, ఎవరికి ఎవరూ ఏం కాని ఆ జీవితం, వాళ్ళ గొడవలు, దెబ్బలాటలు చిన్నతనంలోనే వాడి మనసుని విరిచేశాయి ఆకలి, అసహాయత కలిసి వాడిలో తరచుగా రేపే ప్రశ్న .. "నాకు ఎవరూ లేరా....యింక నా బతుకింతేనా? ' అని జ్ఞాపకాల ఆధారంతో వాడెన్నోసార్లు వెనక్కి, వెనక్కి వెళ్ళి ఎంతగానో ప్రయత్నించాడు ఎవరేనా నా అన్నవాళ్లు గుర్తొస్తారేమోనని ఆరేడేళ్ళ వయసులో మాత్రం తనని కూడా కూడా తిప్పుకునే తాత గుర్తొచ్చేవాడు. "నేను నీ తాతనిరా" అని ఆ ముసలి గొంతు పలికే మాటతప్ప వాడికి యింకే గుర్తు లేదు. ఆ చేరువా ఎన్నాళ్ళో మిగలలేదు. వాడికి చావంటే ఏమిటో యింకా సరిగ్గా తెలియని వయసులోనే ఆ ముసలాడు చచ్చిపోయాడు.

"ఆ ముసలాడు...పుట్టి దొంగరా . నిన్ను మీ అమ్మా నాన్నదగ్గర్నించి ఎత్తుకొచ్చాడురా" అనేవాళ్లు కొంత

మంచి "నువ్వ పుట్టుగుడ్డాడివి కాదురా, ఎవరో కావాలనే నిన్ను గుడ్డాణ్ణి చేశారు....సంపాదనకోసం .." అనే వారు ఇలాంటి మాటలన్నీ వాణ్ణి కల్లోలపరచటానికితప్పమరెందుకూపనికి రాలేదు. కాలం మొండితనాన్ని అలవాటు చేసింది. సాధ్యమైనంతవరకూ నా వాళ్ళు, నాది అన్న ఆలోచనలకి దూరంగా బతకటం అలవాటు చేసుకున్నాడు. "అప్పుడు అవకాశంలేదు.. మరో దారేంలేదు. కానీ యిప్పుడు యిప్పుడు సావిత్రుంది....తనదగ్గర కూడబెట్టిన డబ్బుంది ...అలా ఆలో చిస్తూ ఆ రాత్రి చాలాసేపు గడిపాడు. చాలాసేపు రెప్పయ్యకుండా ఎన్నెన్నో తీపి కలల్ని ఊహించుకున్నాడు.

"చిన్న కూరగాయల కొట్టో, రోడ్డు మీద మరో రకం వ్యాపారమో.. సావిత్రి చూసుకుంటుంది. చిన్న గుడి సెలో కాపరం పెట్టుకోవచ్చు. కొన్నా ళ్ళకి ఒకళ్లో, యిద్దరో పిల్లలు...." వొళ్లు జలదరించింది. వాడికి ఉత్సా హంతో అప్పటికప్పుడే సావిత్రిని నిద్రలేపేయాలనిపించింది.

మర్నాడు కూడా ఆలోచించి నిర్ణ యించుకున్నాక ఆ రాత్రి సావిత్రికి చెప్పేయాలనుకున్నాడు. తిండి తిని పడుకుని దగ్గరగా వున్నప్పుడు నెమ్మ దిగా విషయం అంతా చెప్పాడు. సావిత్రి వుబ్బితబ్బిబ్బయింది. ఆశ్చ ర్యంతో సంతోషంతో వుక్కిరిబిక్కి రైంది. వాణ్ణి వుక్కిరిబిక్కిరిచేసింది. ఆ రాత్రిని అపూర్వ రాత్రిలా మార్చింది వాడికి సావిత్రి. ఇద్దరూ వొకరిలోకి ఒకరు చొచ్చుకుపోయేలా ఆవేశపడ్డారు.

సావిత్రి నుంచి వచ్చే ఉఛ్వాసనిశ్వా సలుఎంతో వేగంగా వీచేగాలి కితప్ప అంత శబ్దం దేనికి వుండదనిపించింది వాడికి—ఆఖరికి సావిత్రిని అదే అడి గాడు "గాలి తుఫాన్లా ఆ చప్పుడేంటి" అని.

"ఏం లేదులే అంది సిగ్గుగా సావిత్రి. కళ్ళు లేవు కాబట్టి సావిత్రి సిగ్గుని చూళ్ళేక పోయాడు. సావిత్రి సిగ్గుని మురిపెంగా విన్నాడు వాడు. ఆ రాత్రి యిద్దరికీ వొళ్ళెరక్కుండానే గడిచింది. ఏం వ్యాపారం చెయ్యాలో సావిత్రినే ఆలోచించమన్నాడు వాడు.

ఆ మర్నాడు వొంటరిగా కూచున్న సావిత్రికి చిత్రమైన ఆలోచనొచ్చింది. ఆ వూహకి వులిక్కిపడింది. "ఛీ... ఛీ ..." అనుకుంది. అయినా ఆ వూహ సావిత్రినొదల్లేదు. నిమి షాల మీద ఎదిగి సావిత్రిని చుట్టు ముట్టింది. కంగారు, కంగారుగానే అక్కడి వాడి బట్టలు, సామాను అంతా వెతికింది. డబ్బున్న చిన్న మూట లాం టిదిగానీ, డబ్బాగానీ కనపడుతుందేమో నని-మళ్ళీ వెతికింది. ఎంత వెదికినా సావిత్రికేం దొరకలేదు. ఆశ... ఆరా టం.... బాధ .... అటో ఇటో తేల్చుకో లేని అస్థిమితం.

కాలుకాలిన పిల్లిలా ఆవసారా అంతా తిరిగింది. అలా తిరుగుతుంటే సావి త్రికి పాత జీవితం కళ్ళ ముందు కది లింది. రూపాయి డబ్బులు కోసం ఇది వరకు పడ్డ నానా యాతనా, మొరటుగా,


ఆరోగ్యం, మజా, జోరూ
తోడు జోడుగా
SPECIAL REFILL PACK
Save Re.1/-
Cadbury's
Bournvita
The tastier food drink
500 g net
Cadbury's
Bournvita
The tastier food drink
OBM 6617 TL
మీ కుటుంబానికి రుచికరమైన బోర్న్‌విటా యివ్వండి. బోర్న్‌విటాలో ప్రకృతిలోని మంచి లక్షణాలుగల కోకో, మాల్ట్, పాలు, పంచదార సమృద్ధిగా వున్నాయి.
ఇప్పుడు ! ఎంతో పొదుపు పూర్తిగా ఒక రూపాయి పొదుపు రీఫిల్ ప్యాక్ కొన్నప్పుడు
క్యాడ్‌బరీస్
బోర్న్‌విటా
దీన్లోని మంచి లక్షణాలన్నీ మీకోసం

బండగా తన శరీరాన్ని హింసించిన ఎన్నో మగ చేతులు, గోతికాడ నక్కల్లా తన సంపాదన తనకి పూర్తిగా దక్క నివ్వని మామూలు రాయుళ్ళు .... ఆ బాధంతా తప్పింది యీ గుడ్డోడి వల్ల.. 'అయినా వెయ్యి రూపాయలు—వెయ్యి రూపాయలంటే.మాటలేంటి... రాణీలా బతకొచ్చు..చిన్న కొట్టెట్టు కోవచ్చు . వడ్డీకి తిప్పుకోవచ్చు... ఆ బతుకే వేరు' అనుకుంది సావిత్రి ఆ వేరే బతుకు లోని సుఖాలు కళ్ళ ముందు మెది లాయి సావిత్రికి. 'మనసు పుడితే చుక్కేసుకోవచ్చు .... కావల్సింది తినొచ్చు . తనకి నచ్చినోడితో, తన అందాలన్నీ చూసి హుషారుగా పడే వాడితో గడపొచ్చు ... ఎంతేనా యీ గుడ్డాడు తన వయసుకి సరైనోడుకాదు. తన మీద చాలా పనోడు .... ఆడి దగ్గ రున్నంత సేపు ఎంతో లాలించినట్టుం టది తప్ప .... ఎప్పుడో కానీ సుఖపడి నట్టుండదు ..."

మొత్తానికి ఆ సాయంత్రం గుడ్డాడు తిరిగొచ్చేటప్పటికి సావిత్రి మనసులో నిర్ణయాని కొచ్చేసింది. రాత్రి తిండి తినేటప్పుడు ఎంతో లయగా అడి గింది .. "డబ్బెక్కడ దాచావేంటి.." అని ..

"వుంది లే....ఏం " అన్నాడు.

"నువ్వన్నట్టు తొరగా ఏదోటి చేద్దాం. చేతిలో సొమ్ముంటే.." అంది నెమ్మదిగా

"సొమ్మెంత సేపే .... ఏం చేద్దామో చెప్పు రేపీపాటికి తెస్తా సొమ్ము..." అన్నాడు వాడు హుషా రుగా....

"అబ్బో గొప్ప....నువ్వు సొమ్ము తేవాలే కానీ .... నేను చెప్పట మెంత సేపు...." అంది.

"సరే అయితే....రేపే తెచ్చి నీ చేతుల్లో పోస్తా... సరేనా .." అన్నాడు

"సరే...." అంది సావిత్రి

ం ం ం

తెల్లారిం దగ్గర్నించీ కొత్త రెక్క లొచ్చిన పక్షిలా వుంది సావిత్రికి మన సు. 'ఇంక కొద్ది గంటలు... వెయ్యి రూపాయలు....ఆ పిచ్చి గుడ్డాడు తెచ్చి తన చేతిలో పోస్తాడు .... యింకా ఆ తర్వాత తను రాణీ '

వుత్సాహం సావిత్రిని వసారాలో నిలవ నివ్వలేదు. సందు దాటి రోడ్డు మీద కొచ్చింది. రకరకాల ఆడాళ్ళని, రంగు రంగుల చీర్లని, వేగంగా వెళ్లే కార్లని, బస్సుల్ని హుషారుగా చూసిం ది. రకరకాల మనుషులు....రకరకాల మగాళ్ళు....మనసుని మరిపిస్తూ నిము షానికో వూహ... యింక మన సుండ బట్టలేదు సావిత్రికి .. బొడ్డులో డబ్బు లున్నాయి .. నెమ్మదిగా మనసుకి నచ్చ చెప్పుకుంది. "ఒక్క చుక్క అని.." కల్లుపాక వెళ్ళి, కడుపు నిండా పుచ్చు కుంది. వొళ్ళు మనసు వూహాల్లో, హుషార్లో తేలుతున్నాయి. ఇంకసావిత్రి లేద్దామనుకుంటుంటే....

"గ్లాసెనక గ్లాసు బలే తాగు తున్నావే...." అన్నాడు సావిత్రి దగ్గ రగా వొచ్చి మల్లయ్య....

"ఏయ్....ఎవరు నువ్వు.. "అంది సావిత్రి మల్లయ్య వేపు మత్తుగా




చూస్తూ ...

"నేనూ నీ లాంటోణ్ణేలే...." అన్నాడు పక్కన కూచుంటూ ... సావిత్రికి ఆ కబురు యీ కబురు చెప్పి మరింత తాగించాడు తాగుడు మత్తుతో పాటు మల్లయ్య మత్తూ ఎక్కింది సావిత్రికి. వెళ్ళే ముందు ఒక్కర్తే వెళ్ళకుండా కూడా మల్లయ్యనీ తీసి కెళ్ళింది.

ం ం ం

వో చేతిని సంచీలో పెట్టి డబ్బుని పట్టుకుని నెమ్మదిగా నడుస్తున్నాడు. తృప్తిగా వుంది వాడికి. "తీసికెళ్ళి సావిత్రికి యిచ్చేస్తే ..." అంతే, అంత కన్నా తను చెయ్యాల్సిందేం. కనిపించటం లేదు వాడికి. రాత్రి సావిత్రికిడబ్బు తెచ్చిస్తానని చెప్పిం దగ్గర్నించీ వాడికి . క్షణం మనసు నిలవటం లేదు. ఎన్నో ఏళ్ళ నుంచీ దాచుకున్న ఆ డబ్బు సావిత్రికి అందించేస్తే చాలు అనిపించింది వాడికి ..తన గుడ్డి బతుకు, అడుక్కునే జీవితం పూర్తిగా మారిపోతోం దన్న భావన వాణ్ని ఆ రోజు మామూలుగా అడుక్కోనివ్వలేదు. మధ్యాన్నమే బైలుదేరి యింటి దారి పడ్డాడు. ఎండ చురుక్కుమంటున్నా చల్లగానే వున్నట్టుంది వాడికి.

సందు మలుపు తిరుగుతుంటే గుండెలు ఘల్లుమన్నాయి వాడికి ఆతృత, వుత్సాహం ... మైమరపు అన్నీ కలిశాయి. ఎప్పుడూ తొందరగా నడవని వాడు కొంచం తొందరగా అడుగు లేశాడు. వసారా గోడ దాకా అలాగే హుషారుగానే నడిచాడు.

వసారా గోడ దగ్గరికి రాగానే విన పడ్డ ఆ చప్పుడు వాణ్ని అణువణునా కుంగ దీసింది. అనుమానం వొచ్చి ఒక్క క్షణం కదల కుండా నిలబడి విన్నాడు. అదే ధ్వని, పాము బుసలా, గాలి తుఫాన్లా సావిత్రి ఆయాసం.... అంటే సావిత్రి మరో మగవాడితో....

ఆ క్షణంలో వాడికేం జరుగుతోందో వాడికే తెలియలేదు. గుడ్డి జీవితానికి వెలుగులా అందినట్టు అందిన పెన్నిధి జారిపోయింది. ఆశలు,

వూహలు. పుత్రోత్సాహం తల్లికి దు లవటమే కాక బతుకులో అన్నేళ్ళ నుంచీ వాడికి తె లి సీ, తెలియకుండా వెతుక్కుంటున్న దగ్గర తనం, నమ్మకం, మానవత్వం అన్నీ నాశనమైనట్టుంది.

మరి కాస్సేపు అ లా గే నిలబడి కావాలనే కర్రతో గట్టిగా చప్పుడు చేస్తూ వసారామెట్ల వే పు నడిచాడు హఠాత్తుగా లేచిన సావిత్రి మల్లయ్యకి చప్పుడు చెయ్యకుండా వెళ్ళిపొమ్మని సైగ చేసింది. మల్లయ్య ఎంత నెమ్మదిగా వెళ్లినా మరో మనిషి అడుగుల చప్పుడు ఆ గు డ్డి చె వు లు వినవే విన్నాయి.

ఆ సమయంలో వాడు రావటం ఆశ్చర్యంగా వున్నా. దానికన్నా ఎక్కువగా మరేదో బాధ కలిగింది సావిత్రికి గుడ్డోడు...జరిగింది వాడికేం తెలుస్తుందిలే...." అని సరిపెట్టుకోవాలని ప్రయత్నించినా సావిత్రి మనసుకి అసంతృప్తి గానే వుంది.

సాయంత్రందాకా ఇద్దరూ పెద్దగా మాటామంతీ లేకుండానే గడిపారు రాత్రి యిద్దరూ కలిసి మామూలుగానే తిండితిన్నారు మామూలుగానే పడుకున్నారు.

ముందు కొంచం జంకినా, చివరికి మొండిగా సావిత్రేముందు వాడి వొంటి మీద చెయ్యేసింది.

మధ్యాహ్నం ఆ వసారా మెట్లు ఎక్కిన క్షణం నుంచీ ఆలోచిస్తూనే వున్నాడు వాడు ఏంచెయ్యాలా అని? సావిత్రిని దూరం చేసుకోటమా.... చేసుకుని తిరిగి అదే వొంటరి బతుకు.... అదేచీకటిలో కూరుకుపోటము....వాడికి మనసొప్పలేదు. మరో మనిషితోడు.... బతికే వున్నావు అని మనసుకి తెలియచెప్పే స్పర్శని దూరం చేసుకోవాలని పించటంలేదు.... ఎంత యిబ్బందైనా ఆశల్ని. బతుకుని పూర్తిగా ఖూనీ చేసుకోటం సాధ్యం కావటంలేదు.

సావిత్రి పాములా మెలికలు తిరుగుతూ వాడి వొంటినంతా తడిమేస్తోంది. అమనిషే....ఆ చేతులే....ఆ స్పర్శే... అయినా వాడికి వేరుగా వుంది... గోతిలో దాచిన డబ్బుని వెతుక్కుంటున్న నక్కలావుంది సావిత్రి చేతివేళ్ళస్పర్శ.

"అంతే....అదొక్కటేదారి. సావిత్రికి దబ్బు అందకుండా జాగ్రత్త పడాలి....' అనుకున్నాడు.

అంతగా కదలికలేని వాణ్ని చూస్తూ....గుడ్డాడికి ఏదో అనుమానం తగిలింది....ఎలాగైనా మళ్ళీ దగ్గరవ్వాలి...." అనుకుంది సావిత్రి.

ఆ రాత్రీ.. అంతకు ముందు రాత్రుళ్ళలాగే గడిచింది. కానీ అనుభూతిలేదు....ఆ తృప్తిలేదు... అంతా బాగానే మామూలుగానే జరిగినట్టుంది. కానీ అలా గడిచిన ఆ సమయంలో జీవితం వున్నట్టులేదు. జీవితానికి, మనుషులకి అవసరమైన స్పర్శ వున్నట్టనిపించలేదు. కళ్లున్న సావిత్రికి. కళ్ళులేని గుడ్డాడికి యిద్దరికీ అలాగే అనిపించింది.

"ఎందుకిలా జరిగింది. తామిద్దరి మధ్యా నిన్నటిదాకా వున్న జీవితం చచ్చిపోయినట్టు ఒక్కరోజులో యిలా అయిపోయిందేమిటి? బతుకుల్ని చంపేసే యింత బలమా డబ్బుకి... వెయ్యి రూపాయలకి...." అనుకున్నాడు గుడ్డాడు. ❊

అంతర్జాతీయ మేధావుల ఆలోచనా మథనం!



# చేతవెన్నముద్ద

— 'వాకాటి'

నాలుగు దశాబ్దాలయినా నిండుగా జీవించని శంకరుడు దేశం నాలుగు చెరగులా చీకటిని ఛేదించి, వెలుగు దీపాలను నింపి ఈజాతిని సాంస్కృతికంగా ఒకటిచేస్తే—

నాలుగు దశాబ్దాలు నిండకుండానే చీకటి తాపానికి ఎర అయిన షెగువారా లాటిన్ అమెరికా నాల్గు చెరగులా విప్లవ జ్యోతిని వెలిగించి ఆ మహా యజ్ఞంలో తానొక సమిధయిపోయాడు.



—నియంతల పాలిట సింహస్వప్నమయిన షెగువారాతో 1964 మేరియో రొసాలియా గువారా అన్నావిడ స్పెయిన్‌లో బంధుత్వం కలపబోయి "మీ పుట్టినచోటేదీ?" అని అడిగితే—

అతడు—"కామ్రేడ్! మా పూర్వీకులు కట్టుబట్టలయినా లేకుండా స్పెయిన్ వదలి వచ్చారు. అంచేత నువ్వు నాకు బంధువు కాకపోవచ్చు.. కాని ఎక్కడ అన్యాయం జరిగినా నువ్వు ఆగ్రహంతో కదిలేదానివయితే మనమిద్దరమూ బంధువులమే!" అన్నాడట

చిన్ననాటినుండే శాపంలాగున ఆస్త్మారాక్షసి అనునిముషమూ పీక్కుతింటున్నా, జీవితం పొడవునా అన్యా

## నేను కవిని కాలేకపోయిన విప్లవ వీరుణ్ణి!

యాన్ని, అస్వాతంత్ర్యాన్ని, అధర్మాన్ని ఎదిరించిన ఆ ఎవరెస్టు శిఖరం—అసలు పేరు ఎర్నెస్టో గువారా. అర్జెంటినాలో పుట్టిన ఇతడు క్యూబాలో ఫిడెల్ కాస్ట్రోతో కలిసి గెరిల్లా యుద్ధం చేస్తుండగా విప్లవవాదు లాతడికి పెట్టిన ముద్దుపేరు 'షె'. క్యూబాలో కీలుబొమ్మ ప్రభుత్వం కీళ్ళన్నీ వూడదీశాక తాను క్యూబా జాతీయ బ్యాంకికి డైరెక్టరుగా వుండగా అతడు ఆ దేశపు కరెన్సీ నోట్లమీద 'షె' అనే సంతకం చేసేవాడు. ఒక ప్రశ్నకు సమాధానంగా అతడు 'షె' అన్నదే నాజీవితంలో అతి ప్రధానమయిన దానికి సంకేతం. నా పేరయిన 'ఎర్నెస్టో'కు గాని, ఇంటి పేరయిన 'గువారా'కు గాని అంత ప్రాధాన్యం లేదు ఎందుకంటే అవి చాలా స్వల్పమయిన, వ్యక్తిగతమయిన సంబంధాలను సూచిస్తాయి—" అని భాష్యం చెప్పాడట.

పీడిత ప్రజలంటే చెరువయే గుండె వుంది. ఆ గుండెయే అగ్రరాజ్యాల కుతంత్రాలకు కుతకుత ఉడికి కుంపటిగా మారగా ఆ నిప్పుల కణాలకు గెరిల్లా వాయువు నలుదిక్కులా విసరగా దేశాల సరిహద్దులను చెరిపివేసిన వాడిని—ఒక దేశం, ఒక భాష, ఒక కుటుంబం, ఒక బాంధవ్యం ఎలా బంధించగలవు?

1928లో పుట్టి, 53లో వైద్య శాస్త్రంలో పట్టభద్రుడయేలోగానే కనపడినదెల్లా చదివిన జ్ఞానమూర్తి షె. నూనె ఓడ మీద పనిచేస్తూ చిలీ, పెరూ, కొలంబియా, వెనిజూయెలాలు తిరిగి, రానున్న రంగానికి సిద్ధమయిన కిశోరం షె. ఆ క్షణం ఆసన్నమయినపుడు అక్షరాలా స్టెతస్కోపు నవతల పారేసి స్టెన్‌గన్‌ను భుజాన ధరించిన కర్మవీరుడు షె. క్యూబా స్వాతంత్ర్యం కోసం నిద్రాహారాలు మాని పోరాడి, అది సాధించాక అయిదారేళ్ళలో ఆ ప్రశాంత జీవనం కొనసాగించ నిచ్ఛగించక-1966 లో బొలీవియాలో నియ తృత్వానికి వ్యతిరేకంగా గెరిల్లా యుద్ధం మొదలుపెట్టి అందులోనే ఆహూతి అయిన లాటినమెరికన్ అభిమన్యుడు షె.

షె తల్లి సీలియా చాల అసాధారణ వ్యక్తి. యవ్వనంలో ఆమె స్త్రీ స్వాతంత్ర్య పోరాటాలతో పాల్గొంది. అర్జెంటీనాలో కారు నడిపిన మొదటి మహిళ ఆమె! జుత్తు కత్తిరించుకున్న మొదటి స్త్రీలలో ఆమె వుంది! బ్యాంక్ చెక్‌లమీద తన పేరు సంతకం చేసిన మొదటి ఆడది ఆమె. ఆమె స్వేచ్ఛా ప్రియత్వాన్ని, తెలివితేటలను హర్షించి ఆమోదించేవాడు షె నాన్న. షె తన పోరాటతత్వాన్నే కాక, అనారోగ్యాన్ని కూడా అమ్మనుండే వారసత్వంగా పొందాడనడంలో ఆశ్చర్యం లేదు.

తల్లితండ్రులు చర్చికి వెళ్లేవారు కాదు గనక షె జీవితంలో చర్చి ప్రసక్తే లేదు. తల్లిదండ్రుల గ్రంథాలయంలో వున్న స్పానిష్, రష్యన్ భాషలలోని పూర్వకాల సాహిత్యంతోబాటు, చరిత్ర, కళలు, మనస్తత్వశాస్త్రం, మార్క్స్, ఎంగిల్స్‌ల రచనలు, డ్యూమా, విక్టర్ హ్యూగో, జాక్ లండన్, గోర్కీ, టాల్‌స్టాయ్ వంటి వారి సృజనాత్మక

రచనలు-లాటిన్ అమెరికన్ సాంఘిక నవలలు-అన్నిటినీ ఔపాసన పట్టాడు బాలుడు షె. కవిత్వమంటే అతడికి ప్రాణం. బాదిలేర్, వెర్లయిన్. లోర్కా, పాబ్లో నెరూడాల కవితల నాతడు ఆస్వాదించాడు. అంతేకాదు, అతడు స్వయంగా కవితలు రాసేవాడు. ఎప్పుడూ తన తలగడ క్రింద దాచుకునే 'రెయిన్ డీర్' అనే కవితా సంపుటి రచయిత, స్పానిష్ కవీ లియాన్ ఫిలిప్స్‌కు రాసిన ఉత్తరంలో షె తన్ను "గమ్యం చేరని కవి"గా వర్ణించుకున్నాడు. చిట్టచివరి రోజులలో బొలీవియాలో నియంతృత్వంతో, నిర్దయతో, ఆకలితో, అనారోగ్యంతో చివరి శ్వాస దాకా పోరాడుతున్న సమయంలోకూడా తన సంచిలో తన డైరీతోబాటు తనకు నచ్చిన కవితలు రాసుకున్న పుస్తకం మోసిన మనీషి షె. అంచేతే అతడు తాను "కవిని కాలేకపోయిన విప్లవ వీరుడి" నన్నాడు. "విప్లవ వీరులు కాలేకపోయిన కవుల" గురించి తెలుగు వారికి చెప్పనక్కర్లేదుకదా!

షె మంచి చిత్రకారుడు. చెస్ ఆటలో దిట్ట. సంగీతం అంటే అతడికి ప్రాణం. లెక్కలు వేయడంలో ప్రవీణుడు. సైక్లింగ్‌లో ఛాంపియన్. ఫుట్‌బాల్, గోల్ఫ్, గుర్రపుస్వారి అతడికి నచ్చిన క్రీడలు. ఒక మోపెడ్ కంపెనీ ప్రకటన నిమిత్తం నాలుగువేల కిలోమీటర్ల దూరం ఏకబిగిన మోపెడ్ స్వారి చేశాడు షె. ఇంతటి పూర్ణపురుషుడు వైద్యం చదివాడు. కుష్ఠురోగుల సేవలో నిమగ్నుడయ్యాడు. తన ఇరవై యేడవ ఏట, 1955 లో జులై 9 న అతడు క్యూబన్ విప్లవ వీరుడు ఫిడెల్ కాస్ట్రోని మెక్సికో నగరంలో కలిశాడు. అది నవచరిత్రకు నాందిక్షణం. ఆ క్షణంనుంచీ కాస్ట్రో శ్రీకృష్ణుడిలా, షె అర్జునుడిలా కలిసి-లాటిన్ అమెరికన్ నియంతల గుండెలకు చిచ్చు పెట్టాడు. ఆ కీలుబొమ్మల సూత్రధారి అమెరికాను గడగడలాడించాడు.

అర్జెంటైనా నియంత పెరాన్ కు వ్యతిరేకంగా జరిగిన విప్లవపోరాటంలో షె తల్లిదండ్రులు ముఖ్యపాత్ర వహించారు. పోలీసులతో పోరాటానికి కావలసిన బాంబులు వాళ్ళింట్లోనే తయారయ్యేవి. ఆ వాతావరణంలో పెరిగిన షె వంటి కర్తవ్యశీలుడు ఇంతింతై వటుడింతయై అన్నట్లుగా ఎదిగి—"లాటిన్ అమెరికాలో ఏదేశమేగినా నేను విదేశీయుడిగా అనుకోలేదు. గ్వాటిమురా మెక్సికో, పెరూ, క్యూబాలలో నేను ఆయా దేశాల వాడిగానే భావించాను" అన్నాడు. ఇంకో సందర్భంలో-"నేను అర్జెంటినాలో క్యూబాలో మసిలాను. కాని లాటిన్ అమెరికా అంతా నా దేశాలే. ఇందులో ఏ దేశానికి ఏ అవసరం ఎప్పుడొచ్చినా వాటి స్వాతంత్ర్య సంపదల కోసం నా ప్రాణాలొడ్డడానికి సంసిద్ధమే!" అని చెప్పగలిగాడు. చెప్పటమేకాదు చేసి చూపించాడు! తన మాట మేరకు క్యూబాలో పోరాడి అక్కడ నియంతృత్వం నశించాక, బొలివియా వెళ్ళి అక్కడ పోరాటంలో అసువులు బాశాడు!! హవానాలో జరిగిన లాటిన్ అమెరికన్ దేశాల

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యవంతమైన గట్టి పళ్ళు



## కోల్గేట్ డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన అపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన నూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క పాటిలేని పర్యాగల నురుగు బాగా లోతుకువేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా మింట్ రుచివలన బ్రష్ చేసుకుంటున్నప్పుడు ఎంతో హాయి.

## నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!




DC.G.74 TL

ఐక్యతా సంస్థలో 'షే'ని "లాటిన్ అమెరికన్ పౌరుడిగా గుర్తించి, అతడికా హక్కు నివ్వారు కాని నిజంగా మున్ముందు వసుధైక కుటుంబం అంటూ ఏర్పడితే ప్రపంచ పౌరులుగా గాంధీ, నేతాజీ, బోస్, మావో, హాల్డేన్ వంటి వారితోబాటు మొదటి పంక్తిలో నిలబడవలసినవాడు షె!

అక్కడి పరిస్థితులను బట్టి, శత్రువుల ఎత్తుగడలను బట్టి 'షె' గెరిల్లా పద్ధతిలో పోరాడాడు. హింసను హింసతో ఎదుర్కొన్నాడు. కాని అతడి ఆశయము, ఆచరణ గమనించితే ప్రజా జీవితంలో పాల్గొనేవారికి చాలా గుణపాఠాలున్నాయి.

స్పెయిన్‌లోనియంత ఫ్రాంకోను ఎదిరించి పోరాడిన ఆల్బర్టో మేయోని తన ఉద్యమానికి గురువుగా ఫిడెల్ కాస్ట్రో ఎన్నుకున్నాడు. "గెరిల్లరీకి 150 ప్రశ్నలు" అన్న-పుస్తకం రచించిన ఈమేయో "లెక్కల మేష్టారుగా" జీవిస్తూ —షె వంటివీరుల్ని తయారు చేశాడు. షె అతిశ్రద్ధగా గెరిల్లా పద్ధతులను అభ్యసించి నూటికినూరుపాళ్లూ తెలుసుకుని రంగప్రవేశం చేశాడు' క్యూబా పోరాటంలో మొదటి ప్రయత్నంలో బాగా దెబ్బలుతిన్న సందర్భంలో —షె— "విప్లవ పోరాటంలో కూడా ఊహించినది వేరు, వాస్తవం వేరుకావటం వల్ల నెత్తురుచిందితే కాని సరయిన పాఠం నేర్వ లేక పోయాము. ఓటమి మా కళ్ళు తెరిచింది. మేము కొన్ని ఎత్తులు వేయటంలో పొరపాటు చేశాము. మార్చుకోవాలని జనం గుర్తించారు. కాని మార్పుతీసుకురాగలం అన్న విశ్వాసం వారిలో లేకపోయింది. అదిసాధ్యం అని వారికి నచ్చచెప్పడమే మన తక్షణ కర్తవ్యం అయింది—" అన్నమాటలు మనదేశంలో రాజకీయాల్లో దద్యోధనప్రియులనుండిదుందుడుకు వాదు'లదాక పరిశీలించదగినవి. నక్సలిజమైనా, సర్వోదయమైనా, ఇంకో యిజమైనా ఇంకొకటయినా ప్రజలుకూడా నడవనిదే ఉద్యమాలకుబాలారిష్టం తప్పదని చరిత్ర చెప్పింది

అంతేకాదు—ఉద్యమ నాయకులు ఎలా వుండాలో ఈ సంఘటన చెబుతుంది.

క్యూబా స్వాతంత్ర్యం పొందాక షె ఉన్నతాధికారిగా ఉన్న రోజులలొ రేషన్ కార్డుల పద్ధతి ప్రవేశపెట్టారు. షె క్రింద పనిచేసే వారందరూ ఒకరోజు సమావేశమై వారి వారి కుటుంబాల కోటాల గురించి మాట్లాడసాగారు వారిలో కొందరు తమకు నిత్యావసర వస్తువులు సరిగా దొరకడం లేదని ఫిర్యాదు చేయగా షె అది సరికాదని చెబుతూ, ఉదాహరణకు తన కుటుంబానికి అన్నీ కావలసినంత దొరుకుతున్నాయన్నాడు.

వెంటనే ఒకతను నవ్వుతూ-"మీరు పెద్ద అధికారికదా....మీ కోటా ఎక్కువ వుంటుంది" అన్నాడు అది విని బాధపడిన షె మరోరోజు సమావేశంలో— నేను కనుక్కున్నాను. మీరు చెప్పింది నిజమే! మాకార్డు మీద కోటా ఎక్కువ వుంది. ఆ దోషాన్ని సరిదిద్దించాను!" అని చెప్పాడట....

షె కాకుండా క్యూబా ఉన్నతాధికారులందరూ చెరకుపైరు కోతల వంటి కార్యాలలో పాల్గొనేవారట! ఇది తెలుసుకున్నా. టాంజానియా అధ్యక్షుడు తన

రేషన్ కోటాను స్వయంగా జనులతో బాటు 'క్యూ'లో నిలబడి తీసుకుంటాడని చదివినా—మన నాయకులకు ప్రజలకు మధ్య ఎంత 'సాన్నిహిత్యం' వుందో కొట్టవచ్చినట్లు తెలుస్తుంది.... "యద్యాచరతి శ్రేష్టః తత్తదేవేతరో జనః" (పెద్దలు ఎలా చేస్తారో సామాన్యులు అలా చేస్తారు) అన్న సూక్తికి ప్రాణం ఏదో బోధపడుతుంది.

"కార్యాచరణను మించిన సూక్తి లేదు" అన్న జాన్ మార్టి మాటను జీవించినవాడు షె. మాటలకు చేతలకు తేడాలేని అద్వైత జీవనం అతడిది అతడి బలహీనతలు మూడేనట—పొగాకు, పుస్తకాలు, చెస్ ఆట! శారీరక సుఖాల కతడి జీవితంలో ప్రాధాన్యం లేదు. కారడివిలోనయినా, క్యూబాలో పదవిలోనున్నా, చాలా తక్కువ సౌకర్యాలతో ఒక యోగిలా జీవించే వాడతడు. కీర్తి ప్రతిష్ఠలు పెరిగి ప్రజలు మెచ్చుకుంటున్నప్పుడు అతడు రొమ్ము విరుచుకోలేదు.

అతడితో పాటు పోరాడిన కెప్టన్ అంటోనియో — 'ఆస్త్మా అనుక్షణము పీడిస్తూన్నా కాళ్ళీడ్చుకుంటూ తనబరువు తాను మోసుకుంటూ నడుస్తున్న షెని చూస్తే అతడి వజ్ర సంకల్పం తెలిసి వచ్చేది. తాను నమ్మిన ఆశయాలమీది అచంచల విశ్వాసమే అతడికా బలాన్నిచ్చింది" అన్నాడు. "గెరిల్లా సన్యాసిలా, యోగిలా వుండాలి." అని నిర్వచించిన షె అలాగే జీవించాడు "గెరిల్లానాయకుడు ఎవరూవేలెత్తి చూపని విధంగా నడుచుకోవాలి" అన్న షె ఆ విధంగానే బ్రతికాడు. మాటలకు చేతలకు వ్యత్యాసంలేని ఆదర్శ జీవితం ద్వారానే విరోధులకన్న నైతికంగా ఎత్తున నిలబడగలగాలన్నదే అతడి పరమాశయము.

అలాటి వ్యక్తులు ఒక్కొక్కరు ఒక్కొక్క మహాశక్తి అవతారం అనడంలో సందేహం లేదు. ముప్పై, నలభై మందితో ఏ లాటిన్ అమెరికన్ దేశంలోనయినా విప్లవ పోరాటం ప్రారంభించవచ్చు"నని షె అన్నప్పుడు ఆ వ్యక్తులు ఆదర్శప్రాయులయి వుండాలనే అర్థం.

సార్త్రె ఒక వ్యాసంలో షెని నిజమైన విప్లవ కారుడిగా వర్ణిస్తూ — ఒకసారి షెయే తన్ని తాను ఇలా వర్ణించుకున్నాడు.— "ఫిడెల్ కాస్ట్రో నా కన్న తెలివిగలవాడినయితే సంపాదించవచ్చుచేమో గాని, కాస్ట్రోతో నాకన్నా గాఢంగా ఏకాభిప్రాయం గలవాడిని మాత్రం కలవలేదు—".

ఆ నరనారాయణుల సంబంధం ఎంత గాఢమైనదో! "విప్లవ దిశలో నాకన్న ముందున్నవాడు షె. ఆశయ నిరతిలో, విద్యలో, నిబ్బరంలో అతడు నాకన్న పైమెట్టు మీద వున్నవాడు షె"— అన్నాడు కాస్ట్రో!!

మధ్యాహ్న మార్తాండుడివలె మండే ఆశయం. దానిని కార్యరూపంలో పెట్టగల చిత్తశుద్ధి, స్వీయసుఖాలను లెక్కచేయని త్యాగనిరతి వుంటే ఆ జీవితం ఎక్కుపెట్టి విడిచిన బాణంలా దూసుకుపోయి లక్ష్యాన్ని సాధించి తీరుతుంది అని మనకు మళ్ళీ ఒకసారి ఋజువు చేసిన మహా మహుడు షె గువేరా?



మనోవిజ్ఞాన శీర్షిక :




డా॥ జయా నాగరాజ్

ఆమె అంతగా చదువు కోలేదు.

కానీ, యింటి పనీ, వంటావార్పూ చక్కగా చేసుకోగలదు. సాంప్రదాయాన్ననుసరించి గుట్టుగా బ్రతుకుతోంది నలుగురు బిడ్డలతో! ఆవిడ భర్త రావు గారు....లక్షలాది "రావు"లలో ఒకరు. "మేము ఫలానా వంశానికి చెందిన వాళ్ళం, ఆ రావుబహదూరు మాకు వేలు విడిచిన మేనమామగారి అల్లుడి చెల్లెలికి మరిదిగారు, ఫలానా కవి గారు మా అమ్మ ప్రక్కనించి తాత గారు" అని చెప్పుకు పోయేరకం.... ఆయనకు ప్రస్తుతం, స్వంత పలుకు బడిగానీ, పేరు ప్రతిష్టలుగానీ లేవు ... పేరు ప్రతిష్టలున్నవారితో ఆయనకి బీర కాయపీచు సంబంధం వున్నది కాబట్టి వారితో సరితూగేటట్టు బ్రతకాలని తపన....": తన చదువు ఉద్యోగము చిన్న అయినా, పెద్ద ఉద్యోగులతో పూసుకు తిరగాలనే ఆశ. ఫలితంగా కొద్దిగా మాత్రమే చదువుకున్న భార్య అంటే చిన్న చూపు, భార్య అంటే, జీతం భత్యంలేని వంటమనిషి, లైంగిక సుఖాలను అందిచేవ్యక్తి, పిల్లల్ని కనే యంత్రం, అనుకునే కుసంస్కారం గల వ్యక్తి రావు ...ఇంత అయినా జీవితాన్ని కిక్కురు మనకుండానే గడుపుకు వచ్చిందావిడ.... అప్పుచేసి పప్పు కూడు అన్నట్టు, భార్యకు చెప్పకుండా తనతోటి ఉద్యోగస్తులనీ లేక స్నేహితులనీ భోజనానికి పిలిచి ఆమె చేత రకరకాల పిండి వంటలు వండించి, వారి

---

**ఇంటి పోరు—పిల్లలకి మానసిక రుగ్మత !!**

**అన్నిటికీ ఆందోళనావస్థ, అసలు ఇల్లే మానసిక రోగ పీడిత నిలయం !!**

---

మెప్పుపొంది అటుపైనభార్యా పిల్లలకు పచ్చడి మెతుకులు పెట్టేరకం రావు.... ఎవరు తిన్నా తినకపోయినా తనకు మాత్రం నాలుగుకూరలు వుండితీరాలి. యింటి ఖర్చు డబ్బులతోనే పండగలూ పబ్బాలు, అతిథులకి విందులూ అన్నీ అమరాలి .... లేకపోతే రాద్ధాంతం తప్పదు. ఈ "మగమహారాజు" రావు గారికి ఓ ఉంపుడు కత్తె కూడా వుంది. అలా అలా పరిచయమైన వ్యక్తిలో అందం ... ఆనందం రెండూ కనిపిం చాయి రావుగారికి. మరో యింట్లో ఆవిడను వుంచి శని ఆదివారాలు ఆమెతో గడిపి, చీవాట్లు వేయటానికీ, చిందులు త్రొక్కడానికీ వారంలోని మిగతా రోజులు యింట్లో వుండేవారా యన.... ఈ సంగతి కని పెట్టి ఆమె నిలదీసి అడిగింది.. ఏడ్చింది పిల్లల ముఖం చూసైనా ఆ సిగ్గుమానిన పని మానమని బతిమిలాడింది ...కాని ఫలి తం శూన్యం.. భార్యను యింత రాచి రంపానపెట్టడం మొదలు పెట్టా డాయన .... ఇదంతా కని పెడుతున్న పదేళ్ళ విజయకు చిరాకు, భయం రెండూ కలిగాయి! తల్లి దండ్రుల కీచు లాటలో నలిగిపోయిందా పాప ఆఖ రుకి స్పృహతప్పి పడిపోవడం మొదలు పెట్టింది..... చదువులో వెనకంజవేయ డం ప్రారంభించింది .... తండ్రి ఆ బిడ్డమీద అజమాయిషీ చలాయిస్తూ జబ్బును మరీ ఎక్కువ చేశాడు ... తనకు ఒకప్పుడు కలిగిన జబ్బుగురించి అందరితో చెప్పి ఎంత డబ్బు వెచ్చిం చిందీ గొప్పగా వర్ణించడమే కానీ పిల్లని గురించి పట్టించుకోలేదు .... తల్లి ఇదంతా చూస్తూ వూరుకోలేక ఆత్మ హత్యా ప్రయత్నం చేసింది ఇది తెలుసుకున్న విజయ మరీ బెంబేలుపడి పోయింది .చివరికి నలుగురూ నాలుగు మాటలనే సరికి, తన పరువు కోసమా అన్నట్టు మానసిక శాస్త్రవేత్త దగ్గరికి విజయను తీసుకొచ్చాడు. చూడ ము చ్చటగా వున్న ఆ పాపకి శారీరక రుగ్మతయేమీ లేదు! స్పృహ తప్పడా నికి కారణం యింటి వాతావరణమేనని తేలింది . విజయను చూపడానికి వచ్చి తన పుట్టు పూర్వోత్తరాలు తన ఘనత చెప్పుకు పోతున్న తండ్రిని హేయ భావంతో చూస్తూ నేను మాట్లాడనా" అని అడిగింది విజయ డాక్టర్ని తల్లి దండ్రులూ లేకుండా చూసి తనచుట్టూ వున్న వాతారవణాన్ని విశదీస్తూ తండ్రి తన తల్లిని ఎలా హింసిస్తున్నదీ విశదీ కరిస్తూనే తెలివి తప్పి పడిపోయింది.... తండ్రి ఆడంబరం....నిరాదరణ, తల్లి హీనస్థితి చేతకాని తనం, మిగతాపిల్లల కువున్న ఆనందం తనకు ఇంట్లో కరువ వడం అన్నీకలిసి విజయను మానసిక రుగ్మతకి గురిచేశాయి.....పిల్లలు పెరిగి పెద్ద వారు కావడానికి అనుగుణ్యమైన, ఆరోగ్యకరమైన వాతావరణం లేకపోతే కృత్రిమ పీడిత వాతావరణంలో పెరగ లేక వాళ్లు రోగగ్రస్తుల వుతారు (adjustment reaction of childhood) ఇది యిలావుండగా రావుగారి పెద్దకూతురుకి—పదో క్లాసు చదువుతున్నదానికి గొంతులో నుంచి ముద్దమిగడం మానేసింది కళ్లు మసకలు

ఈ జబ్బేమిటో కనుక్కుందికి
శాస్త్రజ్ఞులు తీవ్రంగా ప్రయత్నిస్తున్నారట!




కమ్మడం మొదలైంది. పెద్దచదులు చదవాలని అనుకుంటున్న నళినికి ఆడపిల్లలకు పెద్దచదువు ఎందుకనే తండ్రి తత్వం, స్తోమత లేక మెట్రిక్‌తోనే చదువు మాన్పించి టైపు నేర్పించి, ఎవరి కాళ్ళ మీద వారిని నిలబెట్ట గలిగితే తల్లిగా తన బాధ్యత తీరుతోందనుకుంటున్న తల్లి ఆలోచనా కలిసి నళిని ఆశయాలకు గొడ్డలిపెట్టయింది....తీరని కోరికలతో బాధను లోలోపల దాచలేక హిస్టీరియా వ్యాధికి దారితీసింది ... ఈ పిల్లల తల్లి ఒకవంక రావుగారితో వేగలేక మరోవంక మానసికరుగ్మతలకు లోనైన పిల్లలను ఆపుకోలేక విసిగి వేసారి, నిర్లిప్తంగా వుండిపోయింది. మూడుపువ్వులూ ఆరుకాయలుగా ఉండవలసిన కుటుంబం రావుగారి విపరీత తత్వం, నిర్లక్ష్యం, మగవాడనే గర్వం! తాను ఏమిచేసినా చెల్లుతుందనే భావనకు బలైపోయింది! ఒక్క విజయకు, నళినికే కాదు. ఇటువంటి సందర్భాలలో మొత్తం కుటుంబానికే వైద్యం (family Councelling) అవసరం! ఇటువంటి కుటుంబాలను "మానసికరోగ పీడిత కుటుంబాలు" (Pathological families) అంటారు. వీరికి మానసిక వేత్త ఆసరా (Support) అవసరం!

శ్రావ్యమైన గొంతుక ఆవిడది. ఆమె పాడుతుంటే అలా వింటూనే వుండాలనిపిస్తుంది. యాభై ఏళ్ళ పైబడ్డా జీవితంలో ఆమె పొందిన ఆనందం అంటూ వేరే ఏమీ లేదు. యుక్త వయస్సులో ఇల్లూ, వాకిలీ, పిల్లా జెల్లా,

# పరస్పరం

ఓంకార్

ట్రాన్స్‌పరెంట్‌గా తయారైన బోగ
న్విల్లా
పువ్వుమీద ఎండ ఏటవాలుగా
వాలినట్టు
మునివేళ్ళతో స్పృశిస్తే చాలు
నిజానికి—
మరదే చిత్రం—ఎవరూ
అలా ఊరుకోరు
తుపాకి గుళ్ళలా కళ్ళు
నిక్కబొడిచిన వంచి ముళ్ళలా పళ్ళు
వెళ్ళబెట్టుకొని
పగుళ్ళు వారిన బెంళ్లు వళ్ళంతా
కప్పుకొని
తొక్కిపడి కొచ్చిన కాళ్ళలా
తిరుగుతుంటారు
ఎప్పుడెప్పుడనుకుంటూ—
కీళ్లు విరక్కొట్టి మెప్లు కట్టుం
వలసిన
కొండరాళ్ళ ముందు తలొంచు
తారు మళ్ళీ

చుట్టాలూ, పక్కాలూ అంటూ నే రోజులు గడిచిపోయాయి. ఐదుగురు పిల్లలను కని పెంచేసరికి తలవెంట్రుకలు నెరిశాయి.... పెద్దకొడుకు చదువు పూర్తి చేసుకుని, రెక్కలు రెపరెపలాడించుకుంటూ గూటిలోంచి ఎగిరిపోయాడు. రెండో పిల్లకు చదువబ్బలేదు. ఎందుకా అని ఆలోచిస్తే చిన్నప్పటినుంచి ఆ అమ్మాయికి తెలివితేటలు తక్కువేనని తేలింది. ఏదో యింట్లోనే వుంచుకొని ఇంటి పనులు నేర్పిస్తూ యింటే ప్రాప్తం అనుకుంది లక్ష్మి. రెండో పిల్లకి కిందా మీదా పడి రెండో పెళ్లివాడికిచ్చి పెళ్లిచేశారు. అతనిది దాదాపు ముగిసిన కథ! రాజీకి యిది జీవిత లోని మొదటి అధ్యాయం! ముద్దూ ముచ్చటా లేకుండానే యంత్రంలా అతని జీవితంలో అడుగుపెట్టింది. ఆశలు, ఆశయాలు తీరని ఆమె హృదయం ఆవేదనతో మూలిగింది. తిరుగుబాటు చేసింది. నిద్రలేనితనం.. అతివాగుడు.. తనకు ఏవేవో కావాలని కోరడంతో మొదలైన మానసిక రుగ్మత అందరిమీదా, బీభత్సంగా విరుచుకు పడడం, తల్లిని కరవడం, "నువ్వే నాకీ ముష్టి సంబంధం చేశావనడం"తో మానసిక వైద్యశాలలో చేర్పించవలసి వచ్చింది. అతి ఆందోళనావస్థ (Acute Mania) గా ఆమె వ్యాధిని గుర్తించారు. ఈ అమ్మాయితో సతమతమవుతూ, ఆమె చంటిపిల్లలను చూసుకుంటూ తనఇంటికీ, అల్లుడింటికి తిరగలేక "ఆ పిచ్చిది నాకు వద్దు" అంటున్న అల్లుడికి నచ్చ చెపుతూ సగమైన లక్ష్మి మనసుమీద మరొక దెబ్బ. నాలుగోవాడు వెంకట్ తల్లి అక్కయ్య యింటికి పోకూడదంటూ మారాం చేసి తనకు విపరీతమైన తలనొప్పి అంటూ పడకవేయడం. పరకు మాటలాడడం, శూన్యంలోకి చూస్తూ కూర్చోవడం, తనకు చదవాలని లేదనీ .... చనిపోవాలని పిస్తుందనీ ఏడ్వడం మొదలు

# ఇన్‌క్రిమిన్ బాలలు

## కేవలం పెద్దగా కాదు, ఎంతో చక్కగా పెరిగే పిల్లలు!




ఇన్‌క్రిమిన్ టానిక్ పెరిగే వయసులో ఎంతో పెద్ద... పెద్ద తేడాను తెస్తుంది. నిజానికి అసలు విషయం ఏమిటంటే ఇన్‌క్రిమిన్ టానిక్ ఇతర టానిక్‌లకన్న ఓ మెట్టు పైనుంది. ఎందుకంటే, ఆరోగ్యమైన పెరుగుదలకోసం అత్యవసరమైన విటమిన్లతోపాటు ఇన్‌క్రిమిన్‌లో లైసిన్ కూడా ఉంది గనక. ఆ లైసిన్ ఆకలిని పుట్టిస్తుంది.

పిల్లలు చక్కగా పెరగాలంటే బాగా తినాలన్న మాట ప్రతి తల్లికీ తెలుసు. ఈ ఇన్‌క్రిమిన్ అలా బాగా తినే ఆహారాన్ని మేలైన పెరుగుదలకు తోడ్పడేలా మారుస్తుంది మరి.

Lederle ఉత్పాదన

*అమెరికన్ సయానమిడ్ కంపెనీవారి రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్




## ఇన్‌క్రిమిన్* టానిక్

**తినేమంచి ఆహారాన్ని, తీరైనపెరుగుదలగా మారుస్తుంది.**

Sista's-INC-973/80 Tel. F

పెట్టాడు: వాడికీ మానసికశాస్త్రవేత్త వద్ద చికిత్స మొదలు పెట్టింది. . . వున్నట్టుండి వెంకట్ ఒకనాడు మూర్ఛ వచ్చినట్టు ప్రవర్తించి (హిస్టీరియా మూర్ఛవ్యాధి) తనకు మాట పడి పోయిందని సైగలు చేయడం మొదలుపెట్టాడు. దీనిని హిస్టీరియా మూగతనం (Hysterical aphonia) అంటారు: కొడుక్కి మాటపడి పోయిందని బెంబేలుపడుతూ వెంకట్‌ని అపరాత్రివేళ మానసికశాస్త్ర వేత్త వద్దకు తెచ్చింది. ఆమె వీడినో దారికి తెచ్చి ఒకచోట ఎప్రెంటిస్‌గా చేర్పించి, రాజీని కూడా ఒక కొలిక్కి తెచ్చి మందుల మీద నడిపిస్తూ "ఫరవాలేదు" అని లక్ష్మి కాస్త వూపిరి పీల్చుకుందో లేదో—చిన్నమ్మాయి చటుక్కున నిద్ర మాత్రలు మింగి, చస్తానంటూకూర్చుంది. పదో తరగతి మూడుసార్లు ఫెయిలైనా, చదువు ఉన్నవాళ్ళలో కొంతనయం, తల్లి చేతి కందివస్తుందనుకున్న దశలో యిలా జరిగింది. తాను పరీక్ష పాసు కాలేదని తోటివారు అల్లరి చేశారని జబ్బుపడ్డ పిల్లలను పట్టుకొని వేళ్ళాడుతూ తల్లి తనను చూడడంలేదనీ, తనకు కావలసినవి అమర్చడంలేదనీ ఏవేవో పిచ్చి ఊహలతో ఆత్మత్యాగానికి పూనుకుందీ అమ్మాయి! ఈ పిల్లనుకూడా మోసుకొనివచ్చి మానసిక వ్యాధుల ఆసుపత్రిలో చేర్పించింది లక్ష్మి! ఈకధంతా యిలా జరుగుతూవుంటే, తనకు ఏమీ పట్టనట్లు లక్ష్మి భర్త చల్లగా యింట్లో కూర్చున్నాడు! నిద్రాహారాలు మరిచి మానసిక రుగ్మతకి గురైన నలుగురు పిల్లలను ఆదుకుంటూ ఇది ఏ జన్మలో చేసిన పాపమో ఈ జన్మలో శాపంగా పరిణమించింది.... .ఇంకెన్నాళ్లు ఈ బరువు మొయ్యడమో అని నిట్టూర్చింది లక్ష్మి. మనసులోని వేదనల్ని మేళవించి తన బాధను మరవడానికి తనలో తాను పాడుకుంటుంది ఆమెకీ పరిస్థితిలో మానసిక సహాయ వైద్యం (Supportive Psychotherapy) అవసరం. లేకపోతే ఎప్పుడో ఒకప్పుడు కుప్పకూలిపోతుందీవిడ. ధైర్యంగా నిలబడి గుండెనిబ్బరంతో అన్నిటినీ సమర్థంగా, నేర్పుగా ఎదుర్కొంటున్న లక్ష్మి గనుక మానసికంగా కృంగిపోతే ఇక ఆ యింటి కధ ముగింపు విషాదాంతమే!

అన్నయ్య కూతురును కోడలుగా తెచ్చుకోవాలని రమణమ్మకు ఎంతగానో వుండేది. కాని ఏదో తగాదాలతో అన్నయ్య తమ గుమ్మం త్రొక్కడం మానివేశాడు. ఆయనగారు సరేసరి.... ఆ యింటి కాకి ఈ యింట వాలకూడదంటాడు. మరి ఎలా? పిల్లలిద్దరూ మమతలు పెంచుకున్నారు. ముఖ్యంగా తన కొడుకు. మామయ్య కూతురిని తప్ప మరెవ్వరినీ చేసుకోనని భీష్మించుకు కూర్చున్నాడు... ఇది ఒక తీరని సమస్యగానే వుండిపోయింది....యింతలోనే రమేష్ మెడలు వంచి వాళ్ళ నాన్న పెళ్లి చేశారు....రాధ మట్టుకు బావను మరువలేక నర్సు ట్రైనింగ్‌లో చేరింది. ఒకదాని వెనుక ఒకటిగా మెల్లగా కాలగర్భంలో ఏడు సుదీర్ఘ




సంవత్సరాలు కలిసిపోయాయి. రమేష్‌కు ముగ్గురు పిల్లలు.. అయినా తన జీవితంలో ఏదో వెలితి... అసతృప్తి.... గుండె చీకటి పేరుకుపోయింది.... భార్యతో తగవులాడడం ఆమెను నిరాదరణగా చూడడం, వేళకు యింటికి రాకుండా తిరగడం... చిలికి చిలికి గాలివాన అయినట్లు, వారిద్దరిమధ్య అగాధం ఏర్పడింది. భార్య తన ముగ్గురు పిల్లలతో కన్నవారిల్లు చేరింది అదే సమయమని విడాకులకు కోర్టులో వేశాడు రమేష్. రమేష్ తాగడం.... జూదం .. వ్యభిచారం నేర్చుకున్నాడు. తిరుగుతూ తెగిన గాలిపటంలా అలా అలా తేలిపోయాడు... తాగిన మత్తులో యాక్సిడెంట్ జరిగింది రమేష్‌కు. బావకు దెబ్బలు తగిలాయని తెలిసి రాధ వెళ్ళి అతనిని యింటికి తీసుకొనివచ్చింది. తండ్రి యిందుకు నిరసనగా దెబ్బలాడి కూతుర్ని విడిచి స్వగ్రామం వెళ్ళిపోయాడు రమేష్‌కు స్వస్థత చిక్కింది. రాధను తనతో వుండిపొమ్మన్నాడు. విడాకుల పత్రం వస్తేనేగాని తాను ఒప్పుకోనంది దానితో జీవితం మీద విరక్తి చెంది ఆత్మహత్యకు ప్రయత్నాలు చేశాడు రమేష్... ఇక తట్టుకోలేక రాధ లొంగిపోయింది... విడాకుల కోసం రాధ ఒత్తిడి చేస్తున్నా తనకు రాధ లొంగిపోవడంతో విడాకుల అవసరం రమేష్‌కు కనబడలేదు....రాధకో పాప. మామూలుగానే పని చేసుకుంటున్నది. అప్పుడు కలిగింది రమేష్‌కు ఒక రకమైన అనుమానం... ! తనకు అంత తేలికగా లొంగిపోయిన ఆడది తను లేని సమయంలో ఎవరితోనయినా సుఖపడుతుందేమోనని!. అడపాదడపా పని మానివేయడం పనిలో నుంచి కాని వేళలలో రావడం... పొంచి చూడడం మొదలుపెట్టాడు. అక్కడినుంచి రాధను ఉద్యోగం మానేయమనీ, రాత్రి డ్యూటీలకు పోవద్దని అనడం మొదలుపెట్టాడు ఆమెను కొట్టడంవరకూ వచ్చింది కథ.

ఏ మగవానితో మాట్లాడినా, గుమ్మం దగ్గర నిలబడినా, ఆక్షేపిస్తూ రంకుతనాన్ని అంటగడుతూ ఆమె తనను చంపించాలని ప్రయత్నిస్తున్నదని ఆరోపిస్తూ జీవితం నరకం చేయడం మొదలు పెట్టాడు. స్త్రీమీద హేయభావం పెంచుకొని రాధను బాధించడం మొదలు పెట్టాడు....రమేష్‌కు అతి అనుమాన పరిస్థితి (Paranoid State) అనే మానసిక రుగ్మత కలగడంచేతనే తన జీవితంతోపాటు ఇద్దరు ఆడవాళ్ళ జీవితాలను కూడా మట్టిపాలు చేయడం జరిగింది. దీనిని (Socially determined diseases) సంఘం నిర్ణీతం చేసిన వ్యాధి అంటారు. ఆశయాలు సిద్ధించక చెడు అలవాట్లకు లోనై మెదడును, శరీరాన్నికూడా రోగగ్రస్తం చేసుకోవడం జరుగుతుంది. తమకు, తమ చుట్టూ జరిగిన సంఘటనలను ఆధారంగా తీసుకొని ప్రతీ విషయానికీ అనుమానపడుతుంటారు వీళ్ళు! తమ జీవితాన్నే కాక తమ చుట్టూ ఉన్నవారి జీవితాన్ని కూడా దుర్భరం చేస్తారు వీళ్లు. ఒక్కొక్కప్పుడు ఏ ఒక్కరి మీదనో వున్న అనుమానం పలువురి మీద కేంద్రీకరించబడుతుంది. (Pan paranoia) ప్రతివారిమీద ప్రతి సంఘటనమీద రోజూ జరుగుతున్న విషయాలమీదకూడా అనుమానం కొంతమందికి పెరుగుతుంది. అప్పుడు ఏమీ చేయలేక దిక్కుతోచక ఎవరినీనమ్మక, తమ్ము తాముకూడా నమ్మక, ఒక కృత్రిమ వాతావరణాన్ని సృజించుకొని అందులో పరిభ్రమిస్తూ వుంటారు. (Paranoid Schizophernia) విపరీత అనుమానావస్థ అంటారు ఈ రుగ్మతను దీనికి మానసిక చికిత్స అవసరం! ❊

# తీర్పు

## అల్లక కేశవరావు

'క్కడ చేరిన పదిమంది సాయం పట్టి కొంతదూరం ముందుకు సాగనంపితే వాళ్ళ ముఖాల కి.త దుమ్ము కొట్టి దూసుకుపోయి ది పంచాయతీ సమితి వారి జీపు

హఠాత్తుగా నాకు 'తాతగారు' గుర్తొచ్చారు.

తాతగారంటే-స్వయానా నా తల్లి తండ్రో తండ్రి తండ్రో కాదు హయ్యరుగ్రేడు టీచరుగా వృత్తిని ప్రారంభించి స్వయంకృషితో బి. ఏ. పాసై, నలభైయేళ్ళు పైబడ్డ తరువాత నాలాంటి కుర్రాళ్ళతో కలిసి బి. ఇడి. ట్రయినింగయిన నరసింహులు మాస్టరు గారు

ఎప్పుడూ ధరించే ముతక ఖద్దరు పంచా, లాల్చీ, ఫ్రేం ఒకవేపు విరిగి పోగా తాడుకట్టి కాలక్షేపం చేస్తున్న కళ్ళ ద్దాలు, నగానికి పైగా నెరిసిపోయిన జుట్టూ-ఆ ఆకారం చూసి కాలేజీ తెరి చిన కొత్తలోనే నరసింహులుగారికి' గ్రూంలో 'తాతగారు' అనే బిరుదు ప్రదానం జరిగింది.

ఏది ఏమైనా ఆయన మాటల్లో చేతల్లో ప్రస్ఫుటంగా కనిపించే అనుభవ జ్ఞానం వల్ల ఆయనపట్ల నాకు చాలా గౌరవభావ ముండేది. అందుకనే మా ట్రయినింగు పూర్తయి ఆఖరి పరీక్ష రాసిన తరువాత అధ్యాపకులందరిదగ్గరా సెలవు తీసుకుని, రౌండుమహాలు మెట్ల దగ్గిర నిలబడి నరసింహులుగారికోసం వెదికాను. అప్పటికాయన లైబ్రరీ దాటి ముందుకు వెళ్ళిపోతున్నారు. పరుగెత్తి వెళ్ళి కలిసాను

"ఏంవిటి మనవడూ! నా వెంట పడ్డావ్?"-అన్నారు ఆప్యాయంగా నా భుజంమీద చెయ్యివేసి.

"మరేం లేదు తాతగారూ! ఇన్నాళ్లూ కలిసిమెలిసి ఒకరి కొకరుగా ఉన్నాం' ఈనాటితో విడిపోతున్నాం. మళ్ళా ఎన్నాళ్ళకుకలుసుకుంటామో యేమో!" అన్నాను.

"అవునయ్యా! కొన్నాళ్ళపాటు కొంచెం కష్టమనిపిస్తుంది. కాలక్రమాన అన్నిటినీ మరిచిపోతాం, యాంత్రిక జీవితాల్లోకి ప్రవేశించిన తరువాత-" చాలా సాధారణంగా అన్నారు నరసింహులుగారు. నా కా మాటలు రుచించ లేదు.

గేటుదగ్గరున్న ఆంజనేయస్వామి

గుడిదగ్గరకొచ్చాం. నరసింహులుగారు చెప్పులు దిగి రెండుచేతులూ ఎత్తి భక్తి పూర్వకంగా నమస్కరించారు. ఇది ఆయనకు రెండుపూటలా అలవాటు. నా కలాంటి అలవాట్లేం లేవు. అలా గని నేను నాస్తికుణ్ణి మాత్రం కాదు. ట్రయినింగయిన ఆ సంవత్సరకాలంలో ఆ చుట్టుపట్ల ఎవరూ లేని సమయం చూసి నాలుగైదుసార్లు రహస్యంగా నేనూ నమస్కరించి ఉంటాను. మెయిన్‌గేటు దాటి రోడ్డుమీదకొచ్చాం. ఇంక యిద్దరం విడిపోవాలి. ఆయన దాసన్నపేటకీ, నేను గంటస్తంభం రోడ్డుకీ-

నమస్కరించి నేనన్నాను. "తాత గారూ! సెలవు. ఇక విడిపోతున్నాం. నన్ను మరిచిపోకండి. నాదో చిన్న కోరిక, ఉపాధ్యాయుడుగా జీవితం ప్రారంభించనున్న నాకు అనుభవమున్న ఉపాధ్యాయుడుగా ఓ రెండు మంచి మాటలు చెప్పండి."

నరసింహులుగారు నావేపు ప్రేమగా చూశారు. అంతలోనే ఆయన ముఖం గంభీరంగా మారిపోయింది. నిలుచుని వెనుకకు తిరిగారు. కాలేజీ బిల్డింగులన్నీ యిప్పుడు మాకెదురుగా ఉన్నాయి. ఒక్క నిముష మాగి అన్నారు-"చూడు నాయనా! ఇప్పుడు కాలేజీలుగా మారిన ఈ భవనాలన్నీ ఒకనాటి మహారాజా వారి మందిరాలు. చుట్టూ బ్రహ్మాండమైన ప్రహరీ ఉంది. అదిప్పుడు కూలిపోతూంది. గోడచుట్టూ లోతైన కందకముంది. అదిప్పుడు కప్పబడిపోతూంది. ఈ సంవత్సరం నువ్విక్కడ నేర్చుకున్నదంతా ఈ కప్పబడిపోతూన్న కందకంలో పాతిపెట్టి ఇంటికి వెళ్ళు. సుఖపడతావ్"-

తుళ్ళిపడ్డా నా మాటలు విని. ఇంత మంది విద్యాధికులైన అధ్యాపకులు సంవత్సరంపాటు శ్రమపడి మాకు చేసిన మహోపదేశాన్ని ఇంత నిష్ప్రయోజనంగా ఎలా అంచనా కట్టగలిగాడీయన?-

ఊహించుకో లేకపోయాను. నా మనోభావాలను చదివినట్టుగా ఆయనే మళ్లా అన్నారు. "నన్నపార్థం చేసుకోకు మనవడూ! ఇలా అన్నానని, యిక్కడ మనం నేర్చుకున్నది నిరర్థకమని ఎప్పుడూ నా అభిప్రాయం కాదు. దానిని ఆచరణలో పెడుతూ తన పని తాను చేసుకోడానికి అవకాశం లేని దౌర్భాగ్యపు స్థితి ఈనాటి ఉపాధ్యాయులకు పట్టిందనేదే నా ఆవేదన" అని.

ఆ మాటల కర్థం నా కప్పుడు బోధపడలేదు. నాకామాటలు తృప్తినీ కలిగించలేదు. ఇంకా చెప్పాలంటే అంతవరకూ ఆయనపట్ల నాకు గల గౌరవం కొంత పట్టు సడలిపోయింది.

ఇల్లు చేరుకున్నాను. పరీక్ష పాసయ్యానని తెలిసిన నాటినుండీ ఉద్యోగ ప్రయత్నాలు మొదలుపెట్టాను. మా చుట్టుపట్ల సమితులకీ పరిషత్తుకీ అప్లికేషన్లు పంపాను. జిల్లా పరిషత్తునుండి కనీసం ఇంటర్వ్యూకూడా రా లే దు. ఒక సమితివారు పిలిచారు. వెళ్లాను. నా కుద్యోగం దొరికింది. పట్నానికి మూడుమైళ్ళదూరమున్న రామాపురంలో ఈమధ్యనే ఏర్పాటయిన అప్పర్ ప్రయి




మరీ స్కూల్లో హెడ్ మాస్టరుగా వేశారు నన్ను ప్రత్యేకించి బి.ఇడి. పోస్టు క్రియేట్ చేస్తూ.

ఇదంతా నా అదృష్ట మనుకున్నాను. కాని దీని కంతటికీ మూలకారకుడు రామాపురం సర్పంచ్‌గారని అపాయింట్ మెంట్ ఆర్డరు చేతికిస్తూ సమితి గుమాస్తా చెప్పాడు.

రామాపురం సర్పంచ్ అంటే సామాన్యుడు కాడు. చెప్పుకోవలసిన చదువు లేకున్నా చెప్పలేనంత 'తెలివి' కలవాడు. అందుకే ఆయన తనమీద యే రాజకీయపార్టీ ముద్రా వేసుకోలేదు. ఇండిపెండెంటు నంటాడు. ఆయన అడుగుజాడల్లో నడుస్తూ, ఎటు ఊగితే అటు ఊగుతూ నీడలా ఈయ న్ననుసరించే మరో పదిమంది ప్రెసిడెంట్లున్నారు ఆ సమితిలో. అందుకే ఎవర్ననుకుంటే ఆయన్ని సమితి అధ్యక్ష స్థానంలో నిలబెట్టగల సత్తా ఆయన కుంది—స్వయానా తానా స్థానంలో కూచునే అవకాశం లేకపోయినా.

సదరు మహావ్యక్తిని గురించి పరిచయం కలగజేసుకోవడం నా కర్తవ్యం భానించాను. ఇకమీద అదే గ్రామంలో నేనూ ఉండాలికనుకా, నా నా ఉద్యోగ ధర్మనిర్వహణలో ఆయన తోడ్పాటు ఇంతో అంతో అవసర

ముంటుంది కనుకా.

వెళ్ళి నమస్కరించగానే గడగడా ఆయనే మాట్లాడాడు. "వచ్చేశావటోయ్. మంచిపని చేశావ్. అసలు మనసమితిలో బి.ఇడి. పోస్టులేదయ్యా. ఈ సంవత్సరం మా కుర్రాడొకడు పదో తరగతి కొచ్చాడు, వెధవది వాడీ సంవత్సరం పరీక్షలు రాస్తేకాని పాస్ కాడు. వాడికి ట్యూషన్ చెప్పగలవాడెవడూ ఈ సమితిలో లేడు. బి ఇడి.వి కదా! నువ్వయితే పనికొస్తావని రావాలని యిక్కడ వేయించుకున్నాను. ఈ సాయంకాలంనుంచే ట్యూషను ప్రారంభించు. సరే నువ్వెళ్లు. ఏమన్నా పనులుంటే చూసుకో"-అనేసి తన పనిలో తాను లీనమయ్యాడాయన.

నా తల దిమ్మెక్కిపోయింది.ఆయన నన్ను సంబోధించిన పద్ధతీ, మాట్లాడే విధానమూ నాకేమాత్రం నచ్చలేదు. నేనొచ్చింది నా బడిలో పిల్లలకు చదువు చెప్పడానికి కాదు! ప్రెసిడెంటుగార బ్బాయికి ట్యూషను చెప్పడానికి—అందుకనే ఆయన నన్ను వేయించుకున్నాడిక్కడ—ఎంత ఘోరం! నాకు చాలా అవమానమనిపించింది. కాని ఏం చెయ్యగలను? ఏమన్నా చెయ్యగలనా అని??—

బడిగా ఉపయోగపడుతున్న గుడిసెలో అడుగుపెట్టిన తరువాత నాలో మిగిలిన ఉత్సాహం పూర్తిగా చచ్చిపోయింది. విరిగిన కుర్చీలో అతి జాగ్రత్తగా కూచుని పిల్లలకేదో పాఠం చెప్పుకుంటున్నాడొక టీచరు. మరో వేపొక కుర్చీ ఖాళీగా ఉంది. కొంతమంది పిల్లలు బడిచుట్టూ పరుగులు తీస్తూ యేవో ఆటలాడుకుంటున్నారు. నన్ను చూడగానే చెబుతున్న పాఠం ఆపి సాదరంగా ఆహ్వానించాడా టీచరు. నేను కూచుని కాస్త స్థిమితపడిన తరువాత ఆయన చెప్పిన పాఠశాల చరిత్ర స్థూలంగా యిది.

నిన్న మొన్నటి వరకూ అక్కడా యిక్కడా వరండాలమీద జరుపబడుతుండేది బడి. ఈ పాకలో ప్రెసిడెంటుగారి పశువులు కాపురముండేవి. బడిని అప్పర్ ప్రయిమరీ చెయ్యాలంటే కనీసం పిల్లలు కూచోడానికింత స్థిరమైన ఆధరువుండాలి కనుక ఇంతకంటే మంచిది మరొక పాక ప్రెసిడెంటుగారు కట్టించి, అందులోకి పశువుల్ని పంపి ఇందులోకి పిల్లల్ని పంపారు. ఇంత వరకూ యిద్దరే ఉపాధ్యాయులు పని చేస్తున్నారీ బడిలో ఒకరు—బడిలో ఇప్పుడున్నాయన, హయ్యరుగ్రేడు టీచరు. రెండో ఆయన సెకండరీగ్రేడు. పేరు పాపారావు. ఇంతవరకూ ఆ బడికి ప్రధానోపాధ్యాయుడు-నేటి నుండి ఫస్టు అసిస్టెంటు. ఆయనకీ ఉద్యోగం కేవలం అలంకారప్రాయం. నిజానికాయన ఆ ఊళ్ళోనే ఉన్న ప్రెసిడెంటుగారి రైసు మిల్లు మానేజరు. వారానికో పది రోజులకో ఓ సారి బడిలోనికొచ్చి, అవసరమైన చోట్ల సంతకాలు మాత్రం చేసి పోతుంటాడు. ఈ విషయం సమితిలోగల అధికార అనధికార ప్రముఖులందరికీ తెలుసును. కానీ అందరూ ఎవరికి వారే తమకు తెలియనట్టుగా కాలం వెళ్ళబుస్తున్నారు.




కాలేజీలో నేర్పిన ప్రధానోపాధ్యాయుని లక్షణాలూ విధులూ ఓసారి గుర్తు చేసుకున్నాను. సాయంకాలం ఇద్దరు టీచర్లనీ పిలిపించాను. బడి, విద్య, ఉపాధ్యాయుడు-మొదలైన విషయాల మీద చిన్న ఉపన్యాసంలాంటిదిచ్చాను. సరిగా ఎవరి ధర్మం వారు నిర్వర్తించు కోకపోతే ఒప్పుకోనన్నాను అందరం కలిసికట్టుగా పనిచేసి బడిని ఆదర్శ ప్రాయంగా తీర్చిదిద్దుదామని నచ్చ చెప్పాను.

ఏమనుకున్నాడో ఏమో, పాపారావు మర్నాటినుండీ బడికి సక్రమంగా రావడం ప్రారంభించాడు. నాకు చాలా సంతోషమైంది. పదిరోజులయ్యేసరికి బడికి కొత్తగా కళ వచ్చినట్టయింది. ఎవరిపనులు వాళ్ళం చేసుకుంటున్నాం. పిల్లల్లో కూడా నూతనోత్సాహం కనిపించింది. కాని, క్రమంగా....లేట్లు.... పర్మిషన్లు ...ప్రారంభించాడు పాపారావు. ఒకటిరెండ్సార్లు సెలవు పంపకుండా గైరుహాజరయ్యాడు కూడా. మళ్లా బండి పట్టాలు తప్పుతోందని గ్రహించి ఒకసారి హెచ్చరించాను. ఏమనకుండా తన సీట్లోకి వెళ్ళిపోయాడు పాపారావు.

ఆ సాయంత్రం ప్రెసిడెంటుగారు రమ్మంటున్నారని కబురు వచ్చింది. వెళ్లాను. ఆయన తన ధోరణిలోనే మాట్లాడాడు. "ఏమిటోయ్! ఏవో ధర్మోపదేశాలు మొదలెట్టావట. తిన్నగా ఉద్యోగం చేసుకోవాలని లేందేవిటి? ఇంతవరకూ మావాడికి పాఠాలూ ప్రారంభించలేదట నేన్నీకు చెప్పిందేవిటి? నువ్వు చేస్తున్నదేవిటి?-పది

రోజులుగా నేనూళ్ళో లేను. పాపా రావుని మిల్లు కెళ్ళనిచ్చావు కాదట. నా కెంత ట్రబులనీ! ఆ!....సరేలే. వెళ్లు. ఈరోజు నుంచయినా మావాడికి పాఠా లారంభించు"- అని ఒక్కక్షణం ఆగి "పాపారావు రోజూ బడికి రావాలంటే కుదరదోయ్. చిన్నమేష్టరున్నాడుకదా! ఇద్దరి పనీ వాడే చూసుకుంటాడులే"- నచ్చచెప్పాడు. ఈ పద్ధతి కేమనాలో తెలియక వెళ్లిపోయాను. మర్నాటినుండీ పాపారావు బడికి రాలేదు. నేను ప్రెసిడెంటుగా రబ్బాయికి పాఠాలూ ప్రారంభించలేదు. కబురు పంపినా పాపారావు బడికిరాలేదు, సరికదా సెలవూ పంపించ లేదు. రెండురోజు లాగినా ఫలితం శూన్యమయ్యేసరికి మూడోనాడు విషయాన్ని బి. డి. వో. గారికి రిపోర్టు ద్వారా తెలియచేశాను.

వారం రోజుల తరువాత పాపారావును వెంట తీసుకుని ప్రెసిడెంటు స్వయంగా బడి కొచ్చాడు వస్తూనే అడిగాడు "ఏమయ్యా! మా వాడి కెన్ని పాఠాలయ్యాయ్?" అని అస లే పాఠమూ కాలేదని ఆయనకు తెలుసు. "ఏదీ! మీ వాడొకసారి కూడా నా దగ్గరకు రాక పోతే పా ఠా లె లా ఔతాయండీ?"— సౌమ్యంగానే అన్నాన్నేను.

"ఓహో! నీ దగ్గరకు మా వాడు రావాలన్న మాట. నువ్వు మా యింటికి రాలేవు-"అని ప్రతి అక్షరమూ నొక్కి నొక్కి పలికి "మరి పాపారావు సంగతే మాలోచించావ్?"- ఆయనే అడిగాడు. "ఆలోచించడానికేము ం ద ం డీ? ఏ సెలవూ లేకుండా ఆయన బడికి గైరు హాజరయ్యారు. అదె బి. డి. వో. గారికి రిపోర్టు చేశాను. ఇప్పటికైనా మించిందేం లేదు. సెలవు పెట్టినట్టతే సిఫారసు చేస్తాను-" అన్నాను.

తారా జువ్వలా లేచాడు ప్రెసిడెంటు. "నీ బోడి సిఫార్సెవడికి కావాలోయ్? కళ్లు నెత్తికెక్కి నాతో తెచ్చుకున్నావ్. రిపోర్టు చేశాడట రిపోర్టు. ఆ బి. డి. వో. వచ్చి యిక నీకు రక్షిస్తాడులే. రావోయ్ పాపారావ్-" అనేసి వచ్చి నంత హడావుడిగా వెళ్ళి పోయాడు. వెనకాలే పాపారావు కూడా గర్వంగా తలెగరేస్తూ.

రెండో అసిస్టెంటు వచ్చి నా కేదో చెప్పబోయాడు. కాని నేనేం చెప్ప నియ్యలేదు. జ రి గి న విషయమంతా రాసి మరో రిపోర్టు బి. డి. వో. గారికి పంపించాను ఎందుకయినా మంచిదని పదిహేను రోజుల తరువాత సమితి జీపు వచ్చి మా బడి ముందాగింది. మొదట సమితి అధ్యక్షుడు, తరువాత మా గ్రామాధ్యక్షుడు, ఆ వెనుక బి. డి. వో.గారు వరుసగా దిగారు. జీపును చూసి పది మంది గ్రామస్థులు పోగయ్యారు.

జరిగిన కథంతా నా ద్వారా మరో సారి విని, సమితి ప్రెసిడెంటు గారన్నారు "నువ్వు చాలా కథలల్లగలయ్యా! నీ సొంత పనేదో చెప్తే వినలేదని కక్ష కట్టి పాపారావు బడి కొచ్చినా సంతకం చెయ్యనీయకుండా చేస్తున్నావ్. సర్దటానికి సర్పంచ్ గారొస్తే ఆయననీ ధిక్కరించావ్. పైగా లేని పోనివి కల్పిస్తూ నువ్వే వాళ్ళమీద రిపోర్టులు

 

పంపిస్తున్నావ్. బాగుంది-" అని అక్కడ చేరిన వారి నుద్దేశించి అడిగారు "ఏమయ్యా! ఈ కొత్తమాస్టరు బాగా చదువు చెప్తున్నాడా?-"

ఒక్కక్షణం నిశ్శబ్దం. తరువాత మా గ్రామాధ్యక్షుడందుకున్నాడు.

"చెప్పండ్రా. అయ్యగారడుగుతోంది మనక్కావలసింది మన పిల్లల చదువు. ఇన్నాళ్లూ నా దగ్గరకొచ్చి ఏడ్చినవాళ్ళు అయ్యగారే స్వయంగా వచ్చి అడుగుతుంటే మాట్లాడరేంరా?"—

"బళ్ళో కూచుని ఆయనెప్పుడూ సినిమా పుస్తకాలు సదువుకుంటారండి"

"సదువు సంగతడిగితే కస్సున లేస్తాడండి"—

"ఏం కష్టపడ్డా పాపారావు మాష్టారే నండి"—

"ఈయనొచ్చి తరవాత ఒచ్చిన సదువు కూడా మరిసిపోయారండి పిల్లలు"—గుంపులోంచి సమాధానాలు

ఆ చెప్పిన వాళ్ళలో ఏ ఒక్కడికీ బళ్ళో చదువుతున్న పిల్లలు లేరు వాళ్ళంతా సర్పంచ్‌గారి పాలేర్లు మిగిలినవారు నీళ్ళు నములుతున్నారు. ఈ విషయం చెప్పవలసిన అవసరం నాకక్కడ కనిపించలేదు.

మళ్లా సమితి ప్రెసిడెంటుగారారంభించారు. "నువ్వు నాన్ పానల్‌వాడివనీ, నీ ఉద్యోగం పూర్తిగా టెంపరరీ అని మరిచిపోయినట్టున్నావ్. స్టాఫ్‌తో కలిసి మెలసి ఉండలేనివాడివి నువ్వేం పని చెయ్యగలవయ్యా? యదార్థం పాపారావు రిపోర్టు నిజంకాదని అనగలవేమోగాని, ప్రత్యక్షంగా కనిపిస్తున్న ఈ ప్రజల తీర్పును కాదనగలవా? నీలాంటివాడు నా సమితిలో పని చెయ్యడం నాకు పరువు తక్కువ. నిన్ను ఊష్టు చేస్తున్నాను."—

అందరూ జీపెక్కారు.

ఆ మర్నాడు మా సర్పంచ్‌గారే స్వయంగా నా ఊష్టింగార్డరు తెచ్చియిచ్చారు. రిలీవయి నా సామానులు సర్దుకుంటూ ఉండగా నాలో ఒక ప్రశ్న తలెత్తింది.

విద్య, బడి, ఉపాధ్యాయుడు, కర్తవ్యాలు ఇవన్నీ కాబోయే ఉపాధ్యాయులకు శిక్షణాలయాల్లో నేర్పుతారు. కాని ఆ ఉపాధ్యాయుల మీద, విద్య మీద అజమాయిషీ చెలాయిస్తున్న ఈ పెద్దలకూ,-పిల్లల భవిష్యత్తును తామే భస్మం చేసుకుంటున్నామని తెలుసుకోలేని ఈ ప్రజలకూ,-ఇవన్నీ ఎవరు, ఎక్కడ నేర్పుతారు? వారి విధులు వారి కర్తవ్యాలు పెద్దలకూ, ప్రజలకూ తెలియవా? తెలిసినా పాటించనవసరం లేదా? లేక అవకాశమే లేదా?

స్వగ్రామం చేరుకున్నాను. ఇక యేం చెయ్యాలి? ఎవరికి అప్లయ్ చెయ్యాలి?. ఏ సమితికి? .... ఏ జిల్లా పరిషత్తుకి?.. ఎవరికి? ... ఎవరికి? ఆలోచిస్తున్నాను.

హఠాత్తుగా.... ఇన్నాళ్ళ తరువాత.. తాతగారు జ్ఞాపక మొచ్చారు. చివరిసారిగా ఆయన చెప్పిన మాటలు కూడా జ్ఞాపక మొచ్చాయి.... ❊

# సీ రి య ల్




మీరా కంగారుగా ని పలికి అడుగు పెట్టింది

తల్లిని ఆతృతగా "ఎలా వుందమ్మా" అని అడగబోయి ఆవిడ అవతారం చూసి, వెనక్కి తగ్గింది ఆవిడ కళ్లు అగ్నిగోళాల్లా వున్నాయి ఆవిడ ఎంతో ఆవేశాన్నీ. ఆవేదననీ అతి ప్రయత్నం మీద నొక్కి పట్టించని ఆవిడ ముఖమే చెప్తోంది!

బాచి కూడా వుండటం వల్ల ఆవిడ వెంటనే కళ్లు మూసుకొంది.

అదిరే గుండెతో మంచం దగ్గరగా వెళ్ళి "ఎలా వుందమ్మా" నెమ్మదిగా అడిగింది.

"ఊఁ" అందావిడ పళ్ళ బిగువున. ఇంక మీరా ఏమీ అనలేదు.

"పిన్నిగారూ! డాక్టరమ్మగార్ని యిక్కడికి తీసుకురమ్మంటారా" బాచి అడిగాడు.

"వద్దు" అన్నట్టు చేయి వూపింది కాంతమ్మ.

సరోజినీదేవి గొడవ చేసి వెళ్ళేకా ఆవిడ పెద్దగా ఏడుస్తున్నదల్లా ఒక్కసారిగా పడిపోయింది బాచికి ఏం చేయాలో తోచలేదు. ఇంట్లో ఎవరూ లేకుండా ఆవిడని వదిలి ఎక్కడకని వెళ్ళడం. అయినా ఆవిడకి ఫిట్స్ అని అతనికి తెలియదు. అలాంటప్పుడు ఏం చేయాలో తోచక ఆవిడ ముఖం మీద నీళ్లు చల్లి

దగ్గరే కూర్చున్నాడు.

ఆవిడకి తెలివి వచ్చేకా డాక్టర్ని తీసుకొస్తానంటే ఒద్దుగాక ఒద్దంది. మీరాని అడిగితే ఆదివరకెప్పుడూ యిలా రాలేదని చెప్పింది.

ఇది సరోజినీదేవి చేసిన గొడవకే అనుకున్నాడు—సరోజినీదేవి అలాంటి మాటలంటోంటే బాచి తెల్లబోయినట్టు చూస్తూండి పోయాడు. ఆ సరోజినీదేవికి అహంకారం ఎక్కువని మీరా అక్కయ్య మీద ఏదో కసి కొద్దీ అలా అంటోం దని కూడా అనుకున్నాడు బాచి.

"బాచీ నువ్వెళ్ళింక. నేను వచ్చేను కదా" అంది మీరా.

"మళ్లా మధ్యాన్నం వస్తానక్కా" అని వెళ్ళిపోయాడు బాచి.

మీరా వీధి తలుపు ఘడియపెట్టి యిటు తిరిగింది.

కాంతమ్మ లేచి మంచం మీద కూర్చుంది.

"ఎందుకు లేచేవు? పడుకో!" అంది మీరా. తల్లి అవతారం చూస్తే మీరాకి భయం వేసింది. తల్లిని ఎప్పుడూ యింత కోపంగా చూసి ఎరుగదు. అసలు ఆ అవతారమే కొత్తగా అన్పిస్తోంది మీరాకి.

మీరా మాట కాంతమ్మ వినిపించుకున్నట్టులేదు.

కాంతమ్మ మంచం దిగింది. మీరా తల్లి దగ్గరకొస్తూ ఏదో అనబోయింది.

కాంతమ్మ మీరా జబ్బ పట్టుకుని బరబర పక్క గదిలోకి లాక్కు పోయింది.

"ఇప్పుడు చెప్పు. వాళ్లింట్లో ఎవరికి ఆయాగా వుంటున్నావు. ఆవిడకా-వాళ్ళబ్బాయికా?" ఆవిడ రౌద్రావతారం భయం గొల్పుతోంది.

మీరా కంతా అర్థమయిపోయింది. ఇది ఆ సరోజినీదేవి చలవే.

"నువు కూర్చో ముందు" తల్లికి నచ్చ చెప్పబోయింది.

"ముందు నాకు సమాధానం చెప్పు" పులిలా గర్జించింది.

అంత ఆవేశంలో వున్నప్పుడు అబద్ధం చెప్తే అసలే రెచ్చిపోతుందని శాంతంగా అంది. "ఆయాగా కాదు—వంట మనిషిగా—చెప్తే నువు ఒప్పుకోవని...."

మీరా మాట పూర్తి కాకుండానే మీరా జుట్టుపట్టుకుని ముందుకి వంగదీసి వీపు మీద పిచ్చిగా గుద్దింది కాంతమ్మ. అంత శక్తి ఆవిడకి ఎక్కడ నించి వచ్చిందో!

"ఇంతకన్న నాకేదేనా ఇంత విషం పెట్టి చంపేయ కూడదు? నా అడ్డు వుండదు — నీ ఇష్టం వచ్చినట్టు వూరేగచ్చు ...." మీరాని మళ్ళా వెనక్కి గుంజి ఈ చెంపా ఆ చెంపా వాయించింది.

మొదట అయోమయంగా చూసిన విజయ్ మీరాని ఈ చెంపా ఆ చెంపా వాయించేసరికి పెద్దగా ఏడుపు అందుకున్నాడు.



వాడి ఏడుపుతో మీరాని వదిలి గోడకేసి తన తల కొట్టుకోసాగింది కాంతమ్మ.

మీరా చప్పున ఒక్కంగలో తల్లి దగ్గర కెళ్ళి వారించబోయింది. ఆవిడ లొంగలేదు. ఆవిడకి పిచ్చిబలం వచ్చేసింది,

మీరా తల్లి తలవెనకాల రెండు చేతులూ గట్టిగా అదిమి పెట్టింది. అయినా ఆవిడ కొట్టుకోవడం మానలేదు. మీరా వేళ్ళు రాసుకుపోయి — నెత్తురు చిమ్మింది. మీరా తల్లిని ముందుకి బలంగా తోసింది.

"నన్ను చంపేయి — ఆ తర్వాత వాణ్ని చంపేయి — మా పీడ పోతుంది. అప్పుడు నీ పరువుపోదు" ఏడుస్తూ అంది మీరా!

విజయ్ మీరా మెడని రెండు చేతులూ చుట్టి ఏడుస్తున్నాడు.

"ఈ చేసిన పాపాలు చాలవూ ? నువ్వన్నట్టు అప్పుడే ఏ మందో మింగి ప్రాణం తీసుకోక ఏవేవో పిచ్చి పిచ్చిగా ఆశలు పెట్టుకున్నాను. ఇంతకర్మ నా మోహం మీద రాసుంటే అంత తెగింపు ఎక్కడనించి వస్తుంది? ఇంకా ఎన్ని చూడాలని నామోహం మీద రాశాడో! ఎందరి ఆయుర్దాయం నాకు పోశాడో ఆ దేవుడు." నేలకి కరుచుకుని పడుకున్న కాంతమ్మ కుళ్ళి కుళ్ళి ఏడుస్తోంది.

మీరా మెల్లగా విజయ్ చేతులు విడిపించుకుంది. తల్లికి దగ్గరగా జరిగింది, సాధ్యమైనంత మృదువుగా అంది తల్లి ఒంటి మీద చేయివేస్తూ "అమ్మా నామాట విను. ఆవిడ చెప్పింది నమ్మకు, ముందు నువు కాస్త స్థిమితపడు. అన్నీ వివరంగా చెప్తాను."

"నాకేం చెప్పద్దు తల్లీ! నాకేం చెప్పక్కరలేదు." అంటూ గట్టిగా ఏడుస్తూ "ఎప్పుడయినా ఒకదెబ్బ వేసి ఎరుగుదునా? నన్నెంత రాక్షసిని చేస్తున్నావే! నీకేం లోటు చేశానే! ఇంక ఈ వూళ్ళో ఎలా బ్రతకను? అందరూ విన్నారు కదే!" అంటూ లేచి కూర్చుంది. "నిన్ను బంగారంలా పెంచి పెద్దచేసి నీ నీడలో నా కష్టాలన్నీ మర్చిపోదామనికదే ఏ ఆడది చేయనిపని, దొడ్డమ్మ తప్పు తప్పు అని వారించినా వినకుండా నాచేత్తో నేనే బొట్టు చెరుపుకున్నాను. సంఘం విసిరే విసుర్లకి తట్టుకోలేక కదే—నిన్ను ఇంత ధైర్యంగా పెంచలేనని కదూ, నేనా పని చేసింది: నాకేమిటి మిగిలింది భగవాన్! నన్ను ఎందుకు బ్రతికించేవు" రెండు చేతుల్లోనూ ముఖం దాచుకుని రోదించ సాగింది.

మీరాకీ ఏడుపు వచ్చింది. ఇప్పుడేం చెప్పినా తల్లి వినదు అని తెలుసు.

కాంతమ్మ పైకి ఏడుస్తోంది— మీరా లోపల్లోపల బ్రిగ్గుళ్ళి ఏడుస్తోంది.

కాస్సేపు ఇద్దర్నీ చూస్తున్న విజయ్ వంటింట్లోకి వెళ్ళి వాడికి అందుబాటులో వున్న పళ్ళెం పట్టుకుని వచ్చేడు. "అమ్మా! అమ్" పళ్ళెం చూపించేడు వాడికి భోజనం టైము అయి చాలాసేపయింది.

అంత బాధలోనూ మీరాకి నవ్వు వచ్చింది. కాస్సేపయాక పెట్టచ్చని డబ్బా లోంచి బిస్కట్లు తీసి ఇచ్చింది.

విజయ్ వాటిని విసిరి కొట్టేడు.

విజయ్‌ని ఎత్తుకుని వంటింట్లోకి వెళ్ళింది మీరా.

కాంతమ్మ అన్నం తినలేదు. ఆఖరికి ఆవిడచేత గుక్కెడు కాఫీకూడా తాగించలేక పోయింది మీరా.

కాంతమ్మకి టెంపరేచరు కూడా వచ్చింది.

విజయ్ పడుకున్నాడు.

మీరా తల్లికి కాస్త దూరంలో కింద కూర్చుంది. ఎడమొహం పెడ మొహంలో వున్నా ఇంతవరకూ రోజులు పెద్ద మంచిగా లేకపోయినా ఏదోసాఫీగా గడిచి పోతున్నాయి. ఇంతవరకూ తెలిసున్నవాళ్ళు ఎవరూ తటస్తపడలేదు. ఇలా అయిపోయిన తల్లి ఎప్పటికి తేరుకుంటుంది—.

మధ్యాహ్నం మూడు గంటలు అయింది.

బాచి వచ్చేడు. "ఎలావుంది పిన్నిగారూ" అని పలకరించేడు.

"బాగానే వుందమ్మా" కళ్ళు తెరవకుండానే చెప్పింది కాంతమ్మ. బాచి కూడా అబద్ధమాడేడని బాచిమీద ఆవిడకి కోపం వచ్చింది. 'సరోజినీదేవి చెప్పక పోతే తను నిజంగా మీరా అక్కడ ఆయాగా చేస్తుందనుకున్ను'

అయిదు నిముషాలు ఆవిడ దగ్గర కూర్చున్న బాచి మీరాని యివతలకి రమ్మని సంజ్ఞ చేశాడు. మీరా ముందు గదిలోకి వచ్చింది.

"అమ్మగారు రమ్మన్నారక్కా" అన్నాడు.

# 1980లో వేసిన పునాది మీద 1981లో నిర్మాణం సాగిద్దాం

మితిమీరిన ద్రవ్యోల్బణాన్ని 1980లో అరికట్టగలిగాం. బొగ్గు, విద్యుచ్ఛక్తి, పారిశ్రామిక సరుకులు, ఆహారధాన్యాల ఉత్పత్తిని పెంచాం

జాతీయ లాభాల్లో ఎక్కువ వాటాకోసం సమాజంలో ఏ ఒక వర్గమయినా అడిగేలోగా ఈ లాభాలను సంఘటితపరచి ఉత్పత్తిని పెంచుదాం




## కష్టించి పనిచేయడం, స్వయం నిగ్రహం మన సంకేత పదాలుకావాలి

davp 80 462

"ఇంక రానని ఆవిడకి చెప్పాను కదా! ఇంక రాలేను బాచి" అంది.
సరోజినీదేవి వచ్చి వెళ్ళేకా శాంతమ్మగారు చూసిన చూపు మీరా ఎప్పటికీ మర్చి పోలేదు. అయినా తను ఎప్పటి నుంచో మానేయాలనుకుంటోంది.

"పిన్నిగారికి ఒంట్లో బాగుండలేదని చెప్పేనక్కా. అయినా ఓసారి రమ్మను మాట్లాడాలి అన్నారక్కా"

"అమ్మని యిలా రాలేను బాచి. ఇదే చెప్పు. తల్లిని వదిలి రావటానికి లేదుట అని చెప్పు" ఖచ్చితంగా చెప్పింది మీరా.

బాచి వెళ్ళిపోయాడు.

తర్వాత కాఫీ కాచి తల్లికి యిచ్చింది. ఆవిడ తాగనంటే తాగనంది. మీరా ఇంక చేసేది లేక ఓ పక్కన పెట్టి మూత పెట్టేసింది.

సాయంత్రం అయిదు గంటలు కావస్తోంది.

మీరా తల్లిని హాస్పిటల్‌కి తీసుకెళ్తానని బ్రతిమాలింది.

"నాకేమీ వద్దు. నన్నిలా బ్రతకనీ" అని విసుక్కుంది. ఆఖరికి మీరా తనే వెళ్లి మందు తీసుకొస్తానంది

"నువు తెచ్చినా నేను మింగను. అవతల పారబోస్తాను" అరిచినట్టే అంది.

మీరా తల్లి మాటలు లెక్కపెట్టలేదు. ఇలా వుండి మందు లేకపోతే ఎలాగ? అనుకుంది.

మీరా జడ విప్పుకుంది. తలంతా దిమ్ముగా—పచ్చి పుండులా వుంది.

మీరా కళ్ళల్లో గిర్రున నీళ్లు తిరిగాయి.

మీరా చీర మార్చుకుని "అమ్మా! తలుపేసుకో" అంది.

కాంతమ్మ అమాంతం లేచి కూర్చుంది. "ఎక్కడికీ! మళ్ళీ అక్కడికేనా?"

"అక్కడికి చచ్చినా వెళ్ళను—డాక్టరు దగ్గరికి."

"నేను మింగను — నువు తేవద్దు — నేనంత తేలిగ్గా పోయే ఘటాన్ని కాను...."

మీరాకి వెర్రి దుఃఖ మొచ్చింది. తనూ ఏదో అనాలనుకుంది. మళ్ళీ వూరుకుంది. ఆవిడసలే ఆవేశంతో వుంది. ఒంట్లో బాగుండ లేదు. ఇప్పుడు తనేమన్నా యింకా రెచ్చిపోతుంది.

"తలుపేసుకో, విజయ్‌ని ఇంట్లోనే వుంచుతున్నాను" అనేసి బయట కొచ్చేసింది.

ఇదే చూస్తున్న పూజార్లావిడ మీరా తలెత్తి అటు చూసే సరికి చప్పున లోపలికి తప్పుకుంది. వడ్డా బత్తుల తుంగమ్మ కిటికీలోంచి చూస్తోంది.

మీరా గబగబా రోడ్డు మీదకి వచ్చింది.




ఇంక వాళ్ళంతా తనని ఓ వింత మృగాన్ని చూసినట్టు చూస్తారు కావును.

రోడ్డు మీదకి వచ్చేసరికి బాచి మళ్ళా వస్తూ కనిపించేడు.

"నిన్నొకసారి వచ్చి వెళ్ళమంటున్నారక్కా: లేకపోతే అమ్మగారే వస్తార్ట"

మీరాకి చాలా కోపం వచ్చింది. ఇన్నాళ్ళు ఆవిడని ఎంతో గౌరవించింది. "రాలేను—రావటానికి లేదంటే ఏమిటీ నిర్భంధం? ఇనాళ్ళ చేస్తానని ఎగ్రిమెంటు కాని రాసిచ్చానా?" విసుగ్గా కోపంగా అంది,

"ఒకసారి వచ్చి జీతం తీసుకెళ్ళమను అన్నారు"

"ఇంట్లో ఎవరెవరు వున్నారు,"

"అమ్మగారు ఒక్కరే వున్నారు. ఆవిడ అన్నగారు ఇప్పుడే నాతో అంత వరకూ వచ్చేరు—ఎటు వెళ్ళారో మరి."

"హాస్పిటల్‌కి వెళ్తోంది. తొందరగా వస్తే ఈ పూట వస్తుందిట లేకపోతే రేపు వస్తుందట అని చెప్పు" అంది.

సరేనని బాచి వెళ్ళిపోయాడు. మీరా హాస్పిటల్‌కి వెళ్ళిపోయింది.

మీరా కనుచూపుమేర కనిపించే వరకూ నిలబడిన ప్రకాశంగారు మెల్లగా ఆ సందులోకి దారి తీశారు. ప్రకాశంగారిని బాచి కాని మీరా కాని చూడలేదు. తను వాళ్ళకి కనపడకుండా ఓ కొట్టు దగ్గర కాస్త పక్కగా నిలబడ్డారాయన. మాటల్లో అడిగినట్టుగా బాచిని అడిగారు దారిలో మీరా వాళ్ళిల్లు ఏక్కడా అని.

బాచి చెప్పిన ప్రకారం ఆయన వచ్చేరు. ఆయన ఓ యింటి ముందాగి,

"మీరా కాంతమ్మగారు—వాళ్ళిల్లు ఎక్కడా" అని అడిగారు.

"ఆ ఇల్లే" అని పెంకుటిల్లు చూపించేడతను,

ఆయన తడక తోసుకుని లోపలకి అడుగు పెట్టేరు. ఆయన కాళ్ళు వణుకుతున్నాయి—గుండె విపరీతంగా కొట్టుకోసాగింది. పెదాలు అదురుతున్నాయి ఒక్క మాటలో చెప్పాలంటే మనిషి నిలువెల్లా కంపిస్తున్నారు. "వాళ్ళే-వాళ్ళే" ఆయన మనసు గట్టిగా చెప్తోంది. కాంతమ్మ పోలికలు మీరాకి చాలా వున్నాయి.

ఆయనపై గుమ్మం మీద కాలుపెట్టి క్షణం సేపు ఆగి గట్టిగా వూపిరి పీల్చుకున్నారు. గుండె దిటవు చేసుకున్నారు.

తలుపు మీద వణికే వేళ్ళతో నెమ్మదిగా తట్టేరు.

అలా తట్టటంతో తలుపు తెరుచుకుంది—

తలుపు చప్పుడుకి కాంతమ్మ కళ్ళు తెరిచింది. ఆవిడకి లేచే ఓపికలేక లేవాలనిపించక తలుపు ఘడియ వేయలేదు.

గుమ్మంలో అపరిచిత వ్యక్తిని చూచి చప్పున లేచింది. కళ్ళు గిర్రున తిరిగాయి. కళ్లు గట్టిగా మూసుకుని వేళ్ళతో కళ్ళమీద ఓసారి నొక్కుకుని కళ్లు తెరిచింది.

ప్రకాశంగారు ఇంకో రెండు అడుగులు లోపలకి వేశారు.

'కాంతమే! తనకళ్ళు తనని మోసం చేయవు' ఆయన కాంతమ్మని వెంటనే గుర్తు పట్టేరు కాని కాంతమ్మ ఆయన్ని తొందరగా పోల్చుకోలేకపోయింది. అసలే మనసు కుదురులేదు. వంట్లో బాగుండలేదు. 'ఎవరా' అని గుర్తు చేసుకుందామన్నా అంతా ఏమిటో చెదురు మదురుగా వచ్చి పోతున్నాయి.

ఆయన ఇంకో రెండు అడుగులు ముందుకి వేస్తూ వణికే గుంతుకతో "కాంతం" అన్నారు.

నెత్తిమీద పిడుగు పడినట్టు అదిరి పడింది. కళ్లు పత్తికాయల్లా అయినాయి. తూలి పడిపోతానేమో అనిపించి గోడని ఆసరాగా చేసుకుంది—ఇతనే రెండు సంవత్సరాల క్రితం... ...

ఆయన దగ్గరగా వస్తూ, "కాంతం.. నేను నేను...." ఇంకా ఏదో అంటున్నారాయన కాంతమ్మ 'ఆఁ ...' అంటూ కిందపడి పోయింది

ప్రకాశంగారికి కాళ్లూ చేతులూ ఆడలేదు. ఆయన పొద్దున్నే విన్నారు. ఆవిడకి ఫిట్సు వస్తాయని.

ఆయన గబగబా వంటగదిలోకి వెళ్లారు. గ్లాసుకోసం వెతికి ఆ పక్కనే బిందెలో నీళ్లు ముంచి తీసుకొచ్చేరు నుదుటిమీద నీళ్లు చల్లేరు.

"కాంతం-కాంతం, నేను ...నేను, కళ్ళుతెరు "ఆయన కంఠం వణికింది.

"భగవాన్! ఎలాంటి పరిస్థితికి వచ్చేరు. ఎలాంటి కాంతం ఎలా అయిపోయింది." ఆయన చొక్కా జేబులోంచి రుమాలు తీసుకుని నీళ్ళలో తడిపి

నుదుటిమీద వేస్తూ కాంతమ్మ ఏ క్షణాన లేస్తుందా అని ఆ బంగారు క్షణం కోసం ఒళ్ళంతా కళ్లు చేసుకుని వేచి చూస్తున్నారాయన. తనపైమీది కండువా చివళ్ళతో కాంతమ్మ పెదాల చివరనించి కారుతున్న నురగని తుడిచారు.

కాంతమ్మ కదిలింది—

ఆయన ఆతృతగా చూస్తున్నారు—

కాంతమ్మ కళ్ళు తెరిచింది. అయోమయంగా ఇటూ, అటూ చూసింది.

ప్రకాశంగారు కొద్దిగా ముందుకి వంగి "ఎలా వుంది కాంతం" అని అడిగారు.

కాంతమ్మ పూర్తిగా తెలివిలోకి వచ్చింది. ఆవిడకంతా అర్థమయింది. లేని ఓపిక తెచ్చుకుని ఒక్క ఉదుటున లేచి నిలబడింది.

"కాంతం, నెమ్మదిగా" కాంతమ్మ చెయ్యి పట్టుకుంటూ అన్నారాయన.

"ఛీ!" అంటూ చేయి విదిల్చేసుకుంది. ఆవేశంతో ఆవిడ ఊగిపోతోంది నోటి వెంట ఒక్కమాట పెగలట్లేదు.

"కాంతం కూర్చో! నేను అంతా చెప్తాను" అనునయంగా అన్నారు.

"ఏమీ చెప్పక్కర లేదు—వెళ్ళండి! మేము ఎలా ఏడుస్తున్నామో చూద్దామని వచ్చేరా! చూసి ఆనందిద్దామని వచ్చేరా?.. "

ఆయన వారిస్తూ దగ్గర కొచ్చేరు,

కాంతమ్మ గుమ్మంకేసి చేయి చూపిస్తూ "వెళ్ళండి. ఒక్క క్షణం యిక్కడ వుండద్దు—నాకేం చెప్పద్దు వెళ్ళండి" ఆవేశంగా అంది.

గదిలో ఆడుకొంటున్న విజయ్ బూరా వూదుకుంటూ వచ్చేడు.

"నా మాట విను కాంతం! మీ కోసం ఎంత వెతికేనో నాకే తెలియదు. కోవూరు అంతా వెదికేను. స్కూలుకెళ్లి అడిగితే మీ దొడ్డమ్మగారికి ఏలూరు బదిలీ అయిందని చెప్పారు. అక్కడా వెతికాను" ప్రాధేయ పడ్తున్నట్టు చెప్తున్నారాయన.

ఆవిడకి యింకా ఆవేశం వచ్చింది. "అవును అన్నగారిచేత ముందు నా దారి నన్ను చూసుకోమని ఉత్తరం రాయించేసి ఆ తర్వాత నా కోసం తీరిగ్గా వెతికేరు."

"ఉత్తరమా! ఏ ముత్తరం?" ఆశ్చర్యంగా అడిగారాయన.

"మీరు రాయించిన వుత్తరం—మీకే తెలియదూ?"

"నిజంగా—ఆ భగవంతుడి సాక్షిగా నాకు తెలియదు కాంతం."

కాంతమ్మ లోపలికి విసురుగా వెళ్ళింది. పెట్లో అట్టడుగున నలిగిపోయి అక్కడక్కడ చిరిగిన పాత కాగితాన్ని తీసుకొచ్చి ముఖాన్నేసి కొట్టినట్టు విసరి కొట్టింది. (సశేషం)

మల్లాది వెంకట కృష్ణమూర్తి

మినీకథ

# "భయంకర సంఘటన"

"నా జీవితంలో నేనెదుర్కొన్న భయంకర సంఘటనా!" అడిగాడు తన యూనిట్ మెంబర్స్‌తో ఓ అవుట్‌డోర్ లోకేషన్‌లో ముచ్చటిస్తున్న చిత్ర నిర్మాత.

"అవును చెప్పండి." అడిగాడు ఆ చిత్ర నటుడు.

"మొదటి చిత్రం సగ అవ్వగా ఆ కథ సెన్సార్ రూల్స్‌కి విరుద్ధంగా వుందని ఓ స్నేహితుడు చెప్పాడు. సెన్సార్ బోర్డుకి స్క్రిప్ట్ పంపితే వాళ్లు ఫర్వాలేదనేదాకా నిద్ర లేదు. ఓ నమ్మండి."

తర్వాత ఆ చిత్ర నటుడు చెప్పాడు తన జీవితంలో ఎదుర్కొన్న ఓ భయంకర సంఘటన.

"పది సంవత్సరాల క్రింట టీ నగర్‌లో ఓ ఇల్లు కొన్నాను ఆ ఇంటికి ఎవరో చేతబడి చేసారట బయట నుంచి రాళ్ళు వచ్చిపడేవి. ఇంట్లో సామాను వుంచిన చోట వుంచినట్లుండేవికాదు. మనుషులు కనబడేవారుకాదు. ఎవరో నవ్వినట్టు, ఏడ్చినట్టు వినబడేది పది రోజుల్లో యింకో యింట్లోకి మారాను."

నిర్మాత ఆ చిత్ర దర్శకుడిని అడిగాడు "మీ అనుభవాలేమయినా వున్నాయా?"

దర్శకుడు గ్లాసులోని బీర్‌ని పూర్తి చేసి చెప్పాడు.

నాలుగు సంవత్సరాల క్రితం గుంటకల్‌నించి మద్రాస్ వస్తున్నాను కారులో. నిద్ర మత్తులో డ్రయివర్ బండిని ఓ ఎద్దుల బండికి గుద్దేసాడు. నా వళ్ళంతా రక్తం. కదలడానికి వీల్లేకుండా ఇరుక్కుపోయాను కారులో—రక్తం కారిపోతోంది, స్పృహ తప్పింది. అదృష్టవశాత్తు ఓ ఆర్ టి సి బస్ డ్రయివర్ నన్ను చూసి ఆస్పత్రికి తీసుకెళ్ళాడు. పది నిమిషాలు ఆలస్యం అయినా పోయివుండేవాడినట!"

కెమెరామెన్ అంతదాకా నిశ్శబ్దంగా వాళ్ళ సంభాషణ వింటూ వున్నాడు గొంతు సర్దుకుని చెప్పాడు.

"మనందరికీ సంబంధించిన ఓ భయంకర సంఘటన ఇందాకే నా దృష్టిలోకి వచ్చింది. గత పదహారు రోజులుగా చిత్రీకరించిన ఫిలింపూర్తిగా వృధా అయింది మద్రాస్‌లోని లేబరేటరీ నుంచి టెలిగ్రాం వచ్చింది.... కెమేరా షట్టర్ తెరవడం మరిచారు దాన్ని సప్లయి చేసిన అవుట్‌డోర్ యూనిట్ సప్లయర్."

నిర్మాత క్షణకాలం మౌనలో వుండిపోయారు. తర్వాత కళ్ళు మూసుకొని బీర్‌బాటిల్ ఎత్తి గటగట తాగేసాడు ❊

# ఆంధ్రప్రదేశ్‌లో కరువు నివారణ సహాయ చర్యలు

ఈ సంవత్సరం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని అధికభాగం తీవ్రమైన కరువుకు గురి అయింది. దుర్భిక్ష ప్రాంతాల్లో మంచినీరు, ఆహారం, పశు గ్రాసం, ఉపాధి సౌకర్యాలు కల్పించే బృహత్తరమైన సవాలును రాష్ట్ర ప్రభుత్వం విజయవంతంగా ఎదుర్కొంటున్నది.

సహాయ కార్యక్రమాలలోని కొన్ని ముఖ్యాంశాలు :

- ❊ సహాయ కార్యక్రమాల నిమిత్తం రూ. 28.95 కోట్లు విడుదలచేశారు. ఈ మొత్తంలో రాయలసీమ జిల్లాలకు రూ. 15 కోట్లు, తెలంగాణా జిల్లాలకు రూ 10 80 కోట్లు, కోస్తా ఆంధ్ర జిల్లాలకు రూ. 3 15 కోట్లు విడుదల చేశారు
- ❊ బోరింగ్ బావులు, కొత్తగా మామూలు బావుల త్రవ్వకం, మామూలు బావుల లోతు త్రవ్వకం, రక్షిత మంచినీటి సరఫరా పథకాలు అమలు, చెరువుల ద్వారా నీటి రవాణా సౌకర్యాల కల్పన నిమిత్తం 1981 మార్చి ఆఖరునాటికి రూ. 6.50 కోట్లు ఖర్చు చేస్తారు.
- ❊ బోరింగ్ బావుల త్రవ్వకానికి 200 లకు పైగా రిగ్గులు ఉపయోగిస్తున్నారు.
- ❊ మిగులు ప్రాంతాలనుంచి పశుగ్రాసం రవాణా చేయడం ద్వారా సమగ్ర పశుగ్రాసం సరఫరా పథకం అమలు, అటవీ ప్రాంత పశుగ్రాసం నిల్వల నిర్వహణ, డిపోల ద్వారా పశుగ్రాసం విక్రయం జరుపుతున్నారు. రైతులు పశుగ్రాసం పెంపకాన్ని చేపట్టే విధంగా ప్రోత్సాహం కల్పిస్తున్నారు. అనుబంధ ఆహారం సరఫరా వగైరా కార్యక్రమాలు అమలు జరుపుతున్నారు.
- ❊ బాధిత ప్రాంతాల్లో ఉపాధి కల్పనా పథకాలు అమలు జరుపుతున్నారు.
- ❊ వ్యవసాయ రుణాలు, ఇతర స్వల్పకాలిక రుణాల గడువు పునర్నిర్ణయించారు. కొత్తగా పంట రుణాలు మంజూరు చేస్తున్నారు.
- ❊ కరువు బాధిత జిల్లాలకు జాతీయ గ్రామీణ ఉపాధి కార్యక్రమం క్రింద 49,000 టన్నుల ఆహార ధాన్యాలు కేటాయించారు.

పరిస్థితిని గురించి రాష్ట్ర ప్రభుత్వానికి క్షుణ్ణంగా తెలుసు. కరువు బాధిత ప్రాంతాల్లో ప్రజలకు సహాయం అందజేస్తూ కరువు తీవ్రతను తట్టుకోవడానికి అవసరమైన అన్ని చర్యలు తీసుకుంటున్నారు.

15 సమాచార పౌరసంబంధ శాఖ డైరెక్టరుచే ప్రకటితము.

# జపాన్ దర్శనం

దాస్ బాబు

**జపాన్** వ్యవహారమే వేరు! **జపాన్** కాలు మోపక ముందు హైదరాబాదులో కూర్చొని జపాన్‌ని తలుచుకుంటే—రీకో, సీకో, సిటిజన్ వాచీలూ, క్యాల్కులేటర్లూ "లవ్ ఇన్ టోక్యో పాటా...." విధిగా గుర్తుకొచ్చేవి వీటితో పాటు బ్రూస్‌లీ కరాటే, జూడో, సుమో — లాంటి మార్షల్ గేమ్స్ చాలా దారుణంగా కళ్ళ ముందు కదిలేవి. కానీ, తీరా అక్కడికి వెళ్ళేసరికి, వ్యక్తం చెయ్యలేని ఒక ఊహా ప్రపంచంలో అడుగు పెట్టినట్లు, నాకు కనిపించే ప్రతిదీ ఏదో అపూర్వమైనట్లూ అనిపించింది.

"అప్పుచేసి పప్పుకూడు...." అన్నాడు కాని నన్నడిగితే — అప్పిచ్చే అప్పారావు ఉంటే జపాన్ వెళ్ళి రమ్మంటాను. ఎంతసేపూ ఈ నాలుగు గోపురాల మధ్య కూర్చుని ...

....ఈ రాకెట్లూ, గాడ్జెట్లూ ఈనాటి సైన్స్ తెచ్చి పెట్టే ఈ అనర్థకాలు మాకక్కర్లేదు! మట్టూ, మర్యాద, జీవితపు విలువలకి మేం ప్రాధాన్యతనిస్తున్నాం అని పక్కనున్న వాడి ప్రాణాలు పోతున్నా పట్టించుకోని జీవితపు విలువ మనది!

## విమాన మర్యాద!

ఇంతెందుకు మద్రాస్ నుంచి సింగపూర్ వెళ్ళే ఎయిర్ ఇండియా విమానం ఎక్కాం, నా పక్కనే కూర్చున్న వ్యక్తికి వాంతులు మొదలయ్యాయి. దాన్ని "ఎయిర్ సిక్నెస్" అంటారు—మార్నింగ్ సిక్నెస్ లాంటిదే! విమానం గాలిలో తేలగానే—పక్కనున్న మిత్రుడు కళ్ళు తేలవేశాడు. పది నిమిషాల య్యాక వాంతులు మొదలు! ఎయిర్ హోస్టెస్‌ను పిలిచాను. అతన్ని చూసి డిస్పోసల్‌బ్యాగ్—ఓ కాగితం సంచీ యిచ్చి వెళ్ళిపోయింది, ఆమె ఒక్కమాటన్నా పలక్కుండా. అతని వీపు చరుస్తూ, చెవులు మూస్తూ ఎయిర్ హోస్టెస్ పని నేను చెయ్యాల్సొచ్చింది. కౌలాలంపూర్‌లో విమానం ఆగింది. నేరుగా ఆవిడ దగ్గరకు వెళ్ళి మా మిత్రుడికి ఉపశమనం కలిగించమని అడిగా. కళ్ళు మిటకరిస్తూ, తెల్లదొరసానిలా గుడ్లు ఎగరవేస్తూ వయ్యారం వొలకబోస్తుందే కానీ, పేషంటు విషయం పట్టించుకోదు, పైగా—ఆ చివరున్న హోస్టెస్‌కేసి వళ్లికిలించడం, చేతులతో సైగలు చెయ్యడం—మొదలయిన వికారాలని చేస్తూ

వుంది. ఒళ్ళు మండింది కానీ ఏం చేయాలి? సింగపూర్‌లో విమానం మార్చుకొని జపాన్ ఎయిర్ లైన్స్ వాళ్ళ విమానం ఎక్కాం. విమానం ఎగిరిన పదినిమిషాలకి మళ్ళీ మొదలయ్యాయి మా మిత్రుడి ఇబ్బందులు. వెంటనే హోస్టెస్‌కి చెప్పాను. ఆవిడ వచ్చి అతనిని మరొక సీటులో కూర్చోబెట్టి, కాళ్ళకున్న బూట్లను తీసి, కాగితంతో చేసిన చెప్పుల్ని తొడిగి, పైని కాస్త సడలించి—కాసేపు వీపును చరిచి తర్వాత ఏదో మందిచ్చి ఓ అరగంటలో అతన్ని బాగు చేసి నా దగ్గరకు తెచ్చింది. అప్పట్నుంచి "నరిటా"లో దిగేవరకు పదినిమిషాలకొకసారి రావడం పలకరించి వెళ్ళడం, నవ్వించడం—ఇలాంటివి చేసి అతన్ని ఊరడించి "విమాన వనిత" అంటే అలా వుండాలి అనిపించేలా ప్రవర్తించింది.

జపాన్ ఎయిర్ లైన్స్ విమానంలో ఎక్కగానే వేడినీటిలో ముంచిన టవల్ యిస్తారు.—చేతులు, ముఖం తుడుచుకోవాలని, శుభ్రంగా వుండాలని. అంతే కాదు—అట్టలతో చేసిన చెప్పుల జతను కూడా యిస్తారు. ఫ్రీగా కూర్చోవాలని. అసలు ఈ చెప్పుల వ్యవహారం జపాను కల్చర్‌కి సంబంధించింది. జపాన్‌లో ఎవరింటికి వెళ్ళినా బూట్లని గుమ్మంలోనే వదలివేయాలి. ఇది తప్పని సరి. పోతే—గుమ్మం ప్రక్కనే ఆ ఇంటి వాళ్ళ చెప్పులుంటాయి. అవివేసుకొని లోపలికి వెళ్ళాలి. ఆదినుంచి శుచికి జపాన్‌ది పెట్టింది పేరు. అదేమిటో స్వయంగా చూసే అవకాశం కలిగింది. ఇంట్లో చెప్పులంటే సరే అనుకోవచ్చుగాని—మేమొక ప్రెస్‌కి వెళ్ళితే అక్కడ కూడా బూట్లు విప్పి ప్రెస్ వాళ్ళు యిచ్చిన చెప్పులు వేసుకోవాల్సొచ్చింది.

విమానం ఇంకా జపాన్‌లో దిగలేదు!!

---

'కమ్యూనిటీ బాత్'లో జపాన్ సహోదరత్వం






వేడి టవల్స్ యిచ్చాక డ్రింక్స్ యిస్తారు. కోకో కోలా, కిరిన్ ఆరంజి జూస్‌నుంచి-"షివాస్ రీగల్" (అతి ఖరీదైన మద్యం) వరకూ యిస్తారు. వాటితో పాటు చిప్స్, జీడిగింజలు పెడతారు ఒకటీ-రెండు రౌండ్స్ యిస్తారు ఒక పావు గంట అయ్యాక "ఇయర్ ఫోన్స్" అని డాక్టర్స్ వాడే స్టెతస్కోపులాంటివి ఇస్తారు. వాటిని మన సీటుకు కనెక్టు చెయ్యాలి అంతే —ఆరు రకాలైన మ్యూజిక్ వినిపిస్తుంది. మీకు ఏది ఇష్టమో ఆ మీట నొక్కితే అమరగానం వినిపించే గగనసీమలో తేలిపోవచ్చు! విమానంలో ప్రయాణికులు మూడు వందలకు పైగా వుంటారు. అంతమందీ ఈ ఇయర్ ఫోన్స్ పెట్టుకుని వాళ్ళకిష్టమైన సంగీతం వింటూ వుంటారు. ఇంతగా యిన్ని గానకచేరీలు జరిగినా పక్కవాడికి వేరే శబ్దం ఏదీ వినిపించదు! అంత పకడ్బందీగా అమర్చారు జపాన్ సోదరులు!

## రెడ్ డెవిల్

ఓ గంట అయ్యాక భోజనం. రుచి మాటా, మనకది కిట్టేమాట అలా వుంచితే-ప్లేటులో భోజనాన్ని అమర్చే పద్ధతి చూడాలి-ఎంత ముచ్చటగా వుంటుందో! చెంచాలతోపాటు సన్నగా పది అంగుళాల పొడవున్న రెండు చెక్క పుల్లల్ని ఇస్తారు వాటిని 'చాప్ స్టిక్స్' అంటారు ఈ పుల్లలతోనే వాళ్ళు భోం చేస్తారు. వాటితో మనం భోంచెయ్యాలంటే కాస్త నైపుణ్యం కావాలి. వాటితో భోంచెయ్యడానికి నాకు వారం రోజుల తర్ఫీదు కావాల్సొచ్చింది. అక్కడ సముద్రపు చేపలు వాళ్ళ ముఖ్యాహారం. శాకాహారులు అంటూ ఎవరూ లేరు. చేపలు జలపుష్పాలు కనుక వాటిని శాకాహారంకింద లెక్కవేసుకుని మనం రాజీపడొచ్చు!

రొయ్యలు, నత్తలు, పీతలు, ఆయిస్టర్స్ మనకు పేర్లు తెలియని మరో వంద రకాలైన సాగర జీవులు వీళ్ళ క్షుద్బాధను తీర్చుతుంటాయి. అన్నంకూడా వండుతారు, కాని కూరలు అంటే బొత్తిగా తెలియదు. నీటిలో ఉడకబెట్టిన కూరగాయలూ, వెన్న, చీస్ కలిపిన మాంసాహార భక్ష్యాలను భోంచేస్తారు. కారం, మసాలా దినుసులు బొత్తిగా వాడరు. సాల్టు, పెప్పర్ చిన్నచిన్న సీసాలలో ఉంచినట్టే కారాన్ని కూడా చిన్న సీసాలో ఉంచుతారు. కారం పేరు "రెడ్ డెవిల్"! అదంటే అంత భయం వాళ్ళకు! సూప్ విధిగా వుంటుంది. ఆల్చిప్పల సూపు దగ్గరనుంచీ ఉల్లిగడ్డ సూప్ వరకు వందరకాలకు పైగా సూపు చేస్తారు. వాళ్ళ సూపు తాగాలన్నా, తిండి తినాలన్నా కనీసం ఆరు నెలల ట్రెయినింగ్ అవసరం.

ఇంకా విమానంలోనే వున్నాం! భోజనాలయ్యాక సినిమా చూపిస్తారు. సాధారణంగా ఇంగ్లీష్ సినిమాలే చూపిస్తాకాని అవి జపాన్ భాషలో డబ్ అయిన సినిమాలు. అయితే ఇయర్ ఫోన్సు వుంటాయి కాబట్టి చెవులకు అవి తగిలించుకుంటే ఇంగ్లీష్‌లో వినిపిస్తుంది. అవి తీసివేస్తే జపాన్ భాషలో వినిపిస్తుంది.

సినిమా ముగిసిన పావుగంటకి "టీ" ఇస్తారు. ముందుగా పసుపు పచ్చని రంగులో వున్న టీ యిస్తారు. దీన్ని జపాన్ టీ అంటారు. ఈ జపాన్ "టీ కి బోలెడంత చరిత్ర వుంది. వాళ్ళకిదొక పవిత్రమైన ఆచారం.

ఈ టీ ఆచారాన్ని జపాన్ భాషలో "చీనోయు" అని అంటారు. లేత తేయాకుల్ని ఎండబెట్టి పొడి చేస్తారు. దాన్ని 'మచ్చి' అంటారు. ఈ మచ్చీని కుండంత వున్న పింగాణీ పాత్రలో పోసి. మసులుతున్న నీళ్లుపోసి, నురుగ వచ్చే వరకు వెదురు పుల్లలతో కొడతారు. ఆ నురుగును తీసివేసి పాత్రలో వున్న టీని తాగుతారు. దీన్ని వీళ్ళు "టీసెరిమొని" అంటారు. ఈ ఆచారం కనీసం 400 సంవత్సరాల నుంచీ వస్తున్నదట! ఇట్లా టీ చేసుకొని తాగడానికి ఎంత లేదన్న గంట పడుతుంది. సాధారణంగా వాళ్లు సమయాన్ని వృధాపుచ్చరు. మరి ఈ టీ వ్యవహారమేమిటి—అని నా మిత్రుడు టొకాడోని అడిగాను. ఈ "టీ సెరిమొని"లో—టీ చేసిఇచ్చే వ్యక్తీ, పుచ్చుకునేవాళ్లూ మౌనంగా కూర్చొని తమ చుట్టూ వున్న ప్రకృతిని చూస్తూ, పరవశించిపోతూ, కుసుమాలు మౌనంగా చెప్పే ఊసులు వింటూ, ఆకుల సవ్వడిలోని సంగీత మాధుర్యాన్ని ఆస్వాదిస్తూ ఆందంతో, ఆనందంతో మనసు నింపుకొని, నిత్యఅవిశ్రాంత జీవితానికి కాస్త దూరంగా మనసుకింత ప్రశాంతతను కలిగించే వాతావరణాన్ని కల్పించుకోవడమే అని చెప్పాడు. అందుకే ఆదిలో బౌద్ధదేవాలయాలలో 'చీనోయు' జరిగేదట. మురాటా షూకో-అనే బౌద్ధ భిక్షువు 14వ శతాబ్దంలో దీన్ని ప్రవేశపెట్టాడట. దరిమిలా—సెన్‌నో రిక్యూ—అనే వ్యక్తి ఈ ఆచారానికి మెరుగులు దిద్దాడట. ఫలితంగా "టీ గృహాలు" అనేవి వెలిశాయి. ఒక ప్రత్యేకమైన గదిలో పూల



అంతా బ్రూస్ లీ లే!

కుండీలు అమర్చి పదిమందినీ ఆహ్వానించి టీ పుచ్చుకోవడం ఆచారంగా మారింది. నేను నాలుగయిదుసార్లు ఆ టీని చవిచూడాల్సొచ్చింది. సూనె సూనెగా, వగరుగా వుంటుంది.

నేనెక్కిన విమానం పేరు డి. సి. 10. గంటకు వెయ్యి కిలోమీటర్ల వేగంతో దూసుకుపోతూ ఏడు గంటలసేపు ఆకాశాన్ని హడలుగొట్టి సింగపూర్ నుంచి టోక్యో చేరుకుంది. టోక్యోకి సుమారు పంద కిలోమీటర్ల దూరంలో "నరిటా" అనే అంతర్జాతీయ విమానాశ్రయాన్ని నిర్మించారు. ఇక్కడ సుమారు 40 దేశాలనుంచి 180 విమానాలు ప్రతిరోజూ వస్తూ పోతూ వుంటాయి! ఆ ఎయిర్ పోర్ట్ ఎంత రద్దీగా వుంటుందో ఊహించుకోవచ్చు. ఇంచుమించు ఇంత రద్దీగా వున్న విమానాశ్రయం మరొకటి టోక్యోలో వుంది. దాన్ని "హానెడా" ఎయిర్‌పోర్ట్ అంటారు. చైనా విమానాలు హానెడాలోనే దిగుతాయి. హిరోషిమా నాగసాకి, ఒసాకా మహానగరాలకు వెళ్ళాలంటే హానెడా ఎయిర్‌పోర్టు నుంచే వెళ్ళాలి.

నరిటా ఎయిర్‌పోర్టులో దిగకముందు నాకొక విచిత్రానుభూతి కలిగింది. జపాన్‌కు—కంట్రీ ఆఫ్ రైజింగ్ సన్—అనిపేరు. అంటే సూర్యోదయ దేశం అన్నమాట. ప్రపంచంలో ప్రథమంగా సూర్యోదయం జపాన్‌లోనే జరుగుతుంది. తూర్పు ఆసియా దేశాలలో—భౌగోళికంగా—జపాన్ మొదటిదేశం. అందుకే సూర్యుడు యిక్కడ ముందు పుడతాడు. మా విమానం 35,000 అడు



ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధి



ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య

# ప్రధానమంత్రి 20 అంశాల కార్యక్రమం

# లక్షలాది కష్టజీవులకు వరప్రసాదం

ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరా గాంధీ ప్రకటించిన 20 అంశాల ఆర్థిక కార్యక్రమం, వాస్తవానికి ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి సుస్థిరమైన ప్రగతికి సంకేతం. ఇది బడుగు వర్గాల అభివృద్ధికి జరుపుతున్న కృషిలో నూతన అధ్యాయాన్ని ప్రారంభించి లక్షలాది మంది బలహీన వర్గాల ప్రజలలో కొత్త ఆశలను చిగురింప జేసింది.

## వాస్తవాలే ఇందుకు దర్పణం : రికార్డు స్థాయిలో ఆహారోత్పత్తి :

1978-79 లో రికార్డు స్థాయిలో 106.6 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను ఉత్పత్తి చేశారు తుఫాను, దుర్భిక్ష పరిస్థితులు ఏర్పడినప్పటికీ తాత్కాలిక ప్రణాళికలను త్వరితగతిని అమలు జరపడ తో 79-80 లో కనీసం 70 లక్షల టన్నుల మేరకు ఉత్పత్తి సాధించగలిగారు

## ప్రజలకు చౌక వస్త్రాలు :

అంటువైపై నాత మంచి చేనేత పరిశ్రమలను సహకార పద్ధతిలోకి తెచ్చారు

1977-78 లో 189 లక్షల చదరపు మీటర్ల చౌక వస్త్రాలను ఉత్పత్తి చేయగా 1978-79 లో 2 3 లక్షలు 1979-80 లో 330 లక్షల చదరపు మీటర్ల చౌక వస్త్రాలను ఉత్పత్తి చేసి ఇప్పుడు 388 కేంద్రాల ద్వారా ప్రజలకు పంపిణీ చేశారు

## చౌకధర దుకాణాల ద్వారా అత్యవసర సరుకులు :

ఇప్పుడు 22 000 చౌక ధర దుకాణాల ద్వారా ప్రజలకు అత్యవసర సరకులను సరఫరా చేస్తున్నారు.

## భూ సంస్కరణలు :

రాష్ట్రంలో భూ సంస్కరణలను తీవ్రతరంగా అమలు జరుపుతున్నారు. ఇందువల్ల 3.79 లక్షల ఎకరాల మిగులు భూమిని స్వాధీనం చేసుకున్నారు 1 74,125 కుటుంబాలకు భూమి పంపిణీ చేశారు వారిలో చాలామందికు షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలు, వెనుకబడిన తరగతులవారు ఉన్నారు.

## బలహీన వర్గాలకు ఇళ్లు :

ఈ పథకాన్ని ద్విగుణీకృతోత్సాహ తో అమలు జరుపుతున్నారు. 2 5 లక్షల కుటుంబాలకు 5,000 కొత్త వాడలలో వసతి కల్పించారు. 12 లక్షల పేద కుటుంబాలకు ఇళ్ళ స్థలాలు కేటాయించారు

---

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధశాఖ : ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వంచే ప్రకటితము.

గులపైన ఎగురుతూ జపాన్‌లో ప్రవేశించినప్పుడు సుమారు నాలుగు గంటలప్పుడు (ప్రాతఃకాలం) బంగారు వర్ణంలోవున్న సూర్యుడి కాంతి కిరణాలు కనిపించాయి! నాలుగు గంటల్ని మనం తెల్లవారుజాము అని అన్నప్పటికీ అది యింకా రాత్రితోనే సమానం. ఆ సమయంలో ఆకాశంలో సూర్యుడు కనిపించడం నాకు దివ్యానుభూతి. తాంబూలం వేసుకున్న జపాన్ మహిళ అధరాల్లా కనిపించాయి ఆ సమయంలో మేఘాలు!!

రాత్రి 10-30 గంటలకు సింగపూర్‌లో బయలుదేరిన విమానం ఉదయం ఆరుగంటలకు నరిటాలో దిగింది. అక్కణ్ణుంచి టోక్యోకి రెండు గంటల బస్ ప్రయాణం చెయ్యాలి. లిమాసిక్ బస్‌లు ఏయిర్ పోర్టులో వుంటాయి. వీటిలో ఎక్కి సిటీ ఎయిర్‌పోర్టు బస్ టెరిమినస్‌కు వెళ్లాలి. ఆ బస్ కోసం ఎయిర్ పోర్టులోనుంచి బయటికొచ్చాం. విపరీతమైన చలిగాలి ఎముకల్ని కొరకడం మొదలెట్టింది. జపాన్ అంత శీతలంగా వుంటుందని నేననుకోలేదు. తూర్పు ఆసియా ఖండంలో ఒక దేశం అనేసరికి కాస్త అటూయిటుగా మన శీతాకాలపు వాతావరణం వుంటుందనుకొన్నాను. తీరా అక్కడకు వెళ్ళేసరికి మంచు పడుతోంది. 7 నుంచి 10 సెంటిగ్రేడు డిగ్రీల ఉష్ణోగ్రత వుంటుంది. కొన్ని రాత్రులు మైనస్‌లోకూడా వుంటుంది ఉష్ణోగ్రత! జపాన్ అంత శీతల దేశం. టోక్యోలో ఎత్తయిన భవనాన్ని ఎక్కి చూస్తే "ఫ్యూజీ" శిఖరం, జపాన్ ఆల్ప్స్ పర్వతాలు కనిపిస్తాయి. అవన్నీ మంచుతో కప్పబడివుంటాయి. బాగా మంచు కురిసిన రాత్రి పట్టపగల్లా కనిపిస్తుంది. రోడ్లన్నీ తెల్లని మంచుగడ్డలతో వెండి పూతపూసినట్టు వుంటాయి. తెల్లారి చిన్న పిల్లలతో 'స్నోబాల్స్' (మంచు ముద్దలతో) ఆడుకుంటారు థర్డ్‌ఫారం వరకు జాగ్రఫీ చదివి తర్వాత సోషల్ చదివాను. ఈ రెండు చదువులూ గల్లంతయ్యాయి. జపాన్‌కి మర్యాదకోసం ఒక్క సూటునే తీసుకొని వెళ్లాను. ఆ చలికి నేను పడ్డ బాధ ఏ సూటుతోనూ చెప్పుకోలేను! పోతే—మనకి కావలసిన ఉన్ని వస్త్రాలను అరువుగా యిచ్చే కంపెనీలున్నాయి. రెండు స్వెట్టర్లు, ఎయిర్ జాకెట్టూ అరువుకు తెప్పించుకుంటేనేగాని అక్కడ చెల్లిందికాదు. నా ఏకైక సూటు సంగతి సరేసరి! నీడలా నన్నంటుకుని వుంది. పదిహేనురోజులయ్యాక విసుగెత్తి సూటును ఉతికిద్దామని లాండ్రీ షాపుకు వెళితే 2000 యన్స్ అడిగాడు—అంటే ఎనభై రూపాయలు! షర్టూ, ప్యాంటు వుతికి ఇస్త్రీ చేస్తే ఇరవై రూపాయలు! అంత చలిలోనూ చెమటలు పోశాయి. ఆ ఉతుకుడు పనేదో నేనే చెయ్యాలనుకున్నాను. ఎట్లాగో నేను మధ్య రాత్రిలో స్నానం చేస్తాకాబట్టి గుట్టుగానే గుడ్డల్ని జాడించుకోవచ్చననుకున్నాను.

నేను మధ్య రాత్రిలో స్నానం చెయ్యడానికి కారణం లేకపోలేదు, జపాన్‌లో "టీ సెరిమోని" లాగానే స్నానాలు కూడా విచిత్రంగానే జరుగుతాయి. ఇక్కడ స్నానాలను "కమ్యూనిటీ బాత్" అంటారు. అంటే—మూకుమ్మడి



బాంబుల వర్షం తాలూకు గుర్తులు....

స్నానాలన్నమాట। దీన్ని కాస్త వివరించాలి. స్నానాలకోసమని పెద్దగది—(చిన్న హాలు) వుంటుంది. దాని మధ్యలో పెద్ద టబ్బు—నీళ్ళ కుండీ వుంటుంది. దీనిండా వేడినీళ్లు వుంటాయి. ముందుగా పక్కనున్న గదిలో స్టీమ్ బాత్ చెయ్యాలి ఇక్కడే సబ్బుతో కూడా వొళ్లు కడుక్కోవాలి. గోడకు వరసగా షెవర్స్ వుంటాయి. కనీసం పదిమంది పట్టేటంత గదులుంటాయి—అసలయిన స్నానం యిక్కడే ముగుస్తుంది. ఈ స్నానం నగ్నంగానే జరుగుతుంది। ఈ నగ్నజీవులు స్టీమ్‌బాత్ అయ్యాక ప్రక్కనేవున్న ఈ నీటికుండీలో దిగుతారు—నగ్నంగానే। పోతే ఆదినుంచి అలవాటు కాబట్టి వాళ్ళకది ఎబ్బెట్టు అనిపించదు. మొదటి రాత్రి స్నానం చేసేటప్పుడు సగం చచ్చిన ప్రాణానికి—"పుట్టినప్పుడూ బట్ట కట్టలేదు"— అనే సినిమాపాట ఆ సగం ప్రాణాన్ని పోసింది. నాకు ఆ మానస సరోవర స్నానం తప్పలేదు. నిగ్రహం వున్నచోట ఆడ మగ కలిసి అలా జలకాలాడతారు. నాకా ప్రమాదం జరగలేదు. అందుకని—అంతా నిద్రపోయాక ఏ పన్నెండింటికో, ఒంటి గంటకో స్నానం మొదలయ్యేది। అప్పుడే బట్టల ఉతుకుడు కూడా. మనం ఉపన్యాసాలలో దంచే సహజీవనం, సమసమాజం, సహోదరభావం—జపాన్ నీటి కుండీలలో దండిగా కనిపిస్తాయి.

## కోటిన్నర మానవుల మహానగరం!

మా లిమూసిన్ బస్ ఓ గంట ప్రయాణం చేసి టోక్యో మహానగరం పొలిమేరల్లో ప్రవేశించింది. ఒక మలుపు తిరిగి రోడ్డు మార్చుకొని "ఎక్స్‌ప్రెస్

రోడ్డు" మీద కొచ్చి అక్కడ డ్రయివరు ఇరవై రూపాయలు పెట్టి టికెట్ కొన్నాడు. టోక్యో రోడ్ల విషయం తప్పకుండా చెప్పుకోవాలి — నాలుగు రకాలైన రోడ్లు వుంటాయి — ఎక్స్‌ప్రెస్ రోడ్లూ, ఫ్లయివోవర్సూ, మామూలు రోడ్లూ సబ్‌వే రోడ్లూ మామూలు రోడ్లు ముఖ్యమైన ప్రాంతాలలో కనీసం యాభై మీటర్ల వెడల్పు వుంటాయి ఓ పన్నెండు కారులు అటూ యిటూ వెళ్ళడానికి రోడ్డూ — దానికిఇరు పైపులా దీప స్తంభాలూ, చిన్న చెట్లూ పూల మొక్కలూ వుంటాయి మళ్ళీ వాటి వెంబడే నాలుగు కార్లు వెళ్ళే రోడ్లూ వుంటాయి. ఈ రోడ్డును పై నుంచి చూస్తే మూడు భాగాలుగా కనిపిస్తుంది. ఈ భాగాలను పూలమొక్కలూ దీప స్తంభాలు విడదీస్తాయి అంత పెద్దగా వుంటాయి మామూలురోడ్లు, ఫుట్‌పాత్‌ల మీద మనం నడవాలి కొన్ని వీధుల్లోకి కార్లు రావు అట్లాగే కొన్ని ప్రాంతాలలో నడిచేవాళ్ళు కనిపించరు అంతా కార్లమీదనో, రైళ్ళ మీదనో వెళ్తూవుంటారు టోక్యోజనాభా ఒకటిన్నరకోటి ; ఆ మహానగరంలో కోటికిపైగా కార్లున్నాయట। ఇతర ప్రాంతాలనుంచి వచ్చే కార్లు లెక్కలోకి రాలేదు. ఇన్నికార్లు తిరిగినా ప్రమాదాల సంఖ్య బహు స్వల్పం' ఈ కార్లు ఎవడినీ చంపకుండా వుండాలని అపూర్వమైన రోడ్ల విధానాన్ని చేపట్టారు ఎక్స్‌ప్రెస్ రోడ్లు అని పెట్టారు, ఇవి ఇరవై, ముప్ఫై కిలోమీటర్ల వరకూ ఏ అంతరాయం లేకుండా 'వన్ వే ట్రాక్స్" (అంటే ఒక ప్రక్క వెళ్ళే మార్గాలన్నమాట) వుంటాయి అక్కడి నుంచి దారి మార్చుకుని మళ్ళీ ఎక్స్‌ప్రెస్ దారిలో వెళ్ళవచ్చు. ఈ ఎక్స్‌ప్రెస్ దారిలో వెళ్ళినందుకు వందా, రెండొందలూ ఎన్‌లు రోడ్డు రుసుములాగా చెల్లించుకోవాలి. మామూలు రోడ్లమీద మళ్ళీ ట్రాఫిక్ జామ్‌లో యిరుక్కోని పోకుండా ఈ సౌకర్యం చాలా బాగుంది. ఇకపోతే వంతెన రోడ్లు [fly overs] టోక్యోలో వీటిని చూసితీరాలి సుమారు ఆరు అంతస్తుల ఎత్తుగా వుంటాయి. కొన్ని చోట్ల రెండు మూడు అంతస్తుల రోడ్లు కూడా వుంటాయి. అవి ఒకదాని మీద నుంచి మరొకటి వెళ్తూ వుంటాయి భూగర్భంలో వెళ్ళే రోడ్లు వుంటాయి ఈ రోడ్లు మీద రంగు రంగుల్లో పరుగెత్తే కార్లను చూస్తూంటే ఈ సిస్టం" పద్ధతి కోసం ఎన్ని కోట్లు ఖర్చు పెట్టార్రా బాబూ అనిపిస్తుంది. మరొక విషయం — మీరు నమ్ముతారో లేరో టోక్యోలో కారు హారన్ వినిపించదు ! ఎంతసేపు లైట్‌తోనే సిగ్నలు యిచ్చుకోవాలిగాని హారను కొట్టడానికి వీల్లేదు' ఆది అక్కడ రూలు మరో చిత్రమేమిటంటే పెద్దపెద్ద రోడ్ల ప్రక్కన అడుగు ఎత్తులో జల్లెడలా వున్న స్టీలు తడికెలుంటాయి — ఇవి శబ్దాన్ని మింగేసే తడికెలట;; అంటే ఆ రోడ్లుసౌండ్‌ప్రూఫ్‌లన్నమాట ఆకాశహర్మ్యాల కీకారణ్యంలో కార్లు చేసే రొదను అరికట్టే విధానాన్ని నిర్మించిన ఆ మహా సంకల్పం నన్ను ఆశ్చర్యంలో ముంచి వేసింది కొన్ని రోడ్ల మీద టెలివిజన్ కెమెరాలు అమ




ర్చారు. ఏ కారు డ్రయివరన్నా సరిగ్గా ప్రవర్తించకపోతే కంట్రోలు రూములో అది కనిపిస్తుంది. ఆ కారు మరో కిలో మీటరు వెళ్ళేలోగా పోలీసులు ఆ కారునీ డ్రయివరినీ "సురక్షిత ప్రాంతానికి" చుట్టంగా పట్టుకెడతారు. ట్రాఫిక్ పోలీసులకన్నా ఈ టెలివిజన్ కెమెరాలే ఎక్కువుంటాయి!

ఇక రైలుబండ్ల విషయం చెప్పేపనిలేదు. ప్రపంచ లోకెల్లా అతి వేగంగా పోయే రైలుబండ్లు జపాన్‌లోనే వున్నాయి. బులెట్ ట్రెయిన్స్, "హికారి", "మోనోరైలు" "ట్యూబురైలు" ఇలాంటి రైళ్లు మనల్ని హడలుగొడతాయి "హికారి" అనేరైలు గంటకు సుమారు 250 కిలోమీటర్ల వేగ తో ప్రయాణం చేస్తుంది. అంత వేగంతో పొయె ట్రెయినులో కూడా కాఫీ కప్పునిండా పోసి సీటుమీద పెడితే చుక్క వొలకదు। మన కుదుపుల బండిలో కాఫీ మాటేమోగాని సీటుమీద కూర్చున్న పెద్దమనుషులు రబ్బరు బంతుల్లా ఎగురుతూ వుంటారు — పాతనొప్పుల్ని లెక్కేసుకుంటూ. బులెట్ ట్రయిన్ లో టెలిఫోన్లు కూడా వుంటాయి. తదితర సౌకర్యాలు మామూలే. అక్కడ రైలు బండ్లు లేటుగారావు అరగంట కంటే ఎక్కువ లేటయితే ప్రయాణీకులకు టిక్కెట్టు డబ్బులు లెక్కగట్టి మొత్తం యిచ్చేస్తారు। ఇదే పద్ధతి మనదేశంలో వుంటే ఏ ట్రెయినుకూడా ప్రభుత్వానికి మిగలవు. పైగా — ట్రెయిను లేటయితే వోవరుటైము లెక్కగట్టి డ్రయివర్లకి డబ్బులు ఎక్కువిస్తారు ఇక్కడ. ఇది నెగిటివ్ పద్ధతి.

టోక్యో సిటీలో రైళ్ళరవాణా చాలా చిత్రంగా వుంటుంది. సిటీలో పది రకాలైన రైళ్లు నడుస్తుంటాయి. ఇందులో ఒక్కటే గవర్నమెంటువాళ్ళ లైను.

మిగతావన్నీ ప్రైవేటు సంస్థలవే. భూమి ఉపరితలం మీద పడిచే సిటీ ట్రయిను ప్రభుత్వానిది—భూగర్భంలో [Sub ways] నడిచేవి ప్రైవేటు సంస్థలవి. నాకు విచిత్రమనిపించిందేమిటంటే భూగర్భంలో ఈ రైల్వేలైనలు మూడు అంతస్థులుంటాయి—అంటే భూమిలో పదిమీటర్లలోపల ఒక లైను వుంటుంది. ఎస్కలేటర్లద్వారా మరో పదిమీటర్లు క్రిందకు వెళితే మరోలైను, అక్కణ్ణుంచి ఇంకా క్రిందకు వెళితే మరోలైను—మొత్తం మూడు అంతస్థుల్లా ఈరైల్వేలైన్లు వుంటాయి। ప్రతి మూడు నిముషాలకొక ట్రెయిను చొప్పున, ట్రెయినుకో వెయ్యిమంది చొప్పున రోజుకెంత మందిని అటూయిటూ చేరవేస్తాయి? ప్లాటుఫారంమీద గోడలకు కొన్ని సొరుగులుంటాయి. ఆ సొరుగులకు చిన్న చిన్న రంధ్రాలుంటాయి. అందులో మనకు కావలసిన టికెట్ ఖరీదువేసి మీటని నొక్కితే మన టిక్కెట్టూ, మిగతా చిల్లరకూడా ఇట్టే వచ్చేస్తుంది. సాధారణంగా టిక్కెట్లిచ్చే వాళ్లుండరు. అంతా స్వయం సేవే। బండ్లో టిక్కెట్లు అడిగే వాళ్లు కూడా వుండరు. అంత మాత్రాన టికెట్ కొనకుండా ఎవరూ బండెక్కరు. జాతీయ ఆదాయానికి లోటు కలుగుతుందేనన్న మీమాంస ప్రతివాడికి వుంటుంది. నాదేశాన్ని ఎలా బాగుచెయ్యాలా అన్న జిజ్ఞాస ప్రతి పౌరునికి వుంటుంది. ఎదుటివాణ్ని ఎలా గౌరవించాలా, ఎలా సహాయపడాలా అన్న మనస్తత్వం వాళ్ళకుంటుంది. దీనికితోడు—వివరీతమైన క్రమశిక్షణ. ఇంత డిసిప్లిన్ ఏ దేశంలోనూ వుండదేమో. ట్రెయిన్స్‌లో, బస్సుల్లో, పబ్లిక్ స్థలాల్లో సిగరెట్ తాగకూడదు అనే రూలు వుంది. ఈ స్థలాల్లో సిగరెట్ తాగేవాణ్ని ఒకన్ని చూడలేరు జలుబు చేస్తే ఎదుటివాడికి అంటుకుంటుంది. అందుకని ముక్కుకు, నోటికి మందులో ముంచిన బాండేజి కట్టుకుంటారు. అక్కడక్కడా వాళ్లు కనిపిస్తే—జైనులేమో అనుకున్నా. జలుబుగాళ్ళని తెలుసుకుని ముక్కుమీద వేలేసుకున్నాను। మద్యం పుచ్చుకుంటే కారు నడిపించకూడదు నేను హిరోషిమాకు వెళ్లివచ్చి "హనెదా" విమానాశ్రయంలో కారుకోసం ఎదురుచూస్తున్నా. మోరి—అనే మిత్రుడు ఎయిర్‌పోర్టుకు వచ్చి నన్ను తీసుకొని వెళ్తానన్నాడు. అతనికోసం ఎదురుచూస్తూ వున్నాను. అతనూ, అతనితో పాటు ఓ కొరియా అమ్మాయి వచ్చారు. "నేను బీరు తాగాను. మద్యం తాగితే కారు డ్రయివు చెయ్యకూడదు. అందుకే ఈ కొరియన్ గర్ల్‌ని తీసుకొచ్చాను"—అంటూ ఆమెను పరిచయం చేశాడు. రాత్రి పదిగంటలప్పుడు, ఆ మహానగరంలో, ట్రాఫిక్ సముద్రంలో ఒకబొట్టులాగవెళ్ళే కారుని ఆపి ఎవరు చెక్ చేస్తారని ఆ జాగ్రత్త? అదంతే. దాన్నే పౌరుని బాధ్యత అంటారు దాన్నే డిసిప్లేన్ అంటారు. దాన్నే బాగుపడేరాత అని మనం అనుకోవచ్చు. రూల్ అంటే రూలే—అంతా విధిగా పాటిస్తారు. రోడ్డుమీద కాగితాలు వెయ్యకూడదు — ఈ రూల్ ప్రతిదేశంలోనూ వుంటుంది. టోక్యో అంత మహానగరంకదా—నాకు ఒక్క కాగితం ముక్క కనిపించలేదు। చెత్తా చెదారం




—అసలు వాళ్ళకవి వుంటాయా లేదా అన్నంత శుభ్రంగా వుంచుతారు. నమ్మలేనంతా పరిశుభ్రంగా వుంటే ఇద్దరి ముగ్గురిని అడిగి చూశా — ఎలా వీలువడుతుంది ఇలావుంటానికి అని. తర్వాత తెలిసింది — ప్రపంచంలో కల్లా అతి పరిశుభ్రమైన దేశం జపాన్ దేశమని. రోడ్డు మీద మూత్రం విసర్జించడం అన్నది వాళ్ళకు తెలియదు. ఇంతెందుకు సింగపూర్‌లో రోడ్డు మీద ఎవరన్నా మూత్రం విసర్జించినా, సిగరెట్ పీకలు వేసినా, అడ్డ గోలుగా రోడ్డు క్రాస్ చేసినా—500 డాలర్లు ఫైను పడిందన్న మాటే—అంటే రెండు వేల రూపాయల జరిమానా అన్న మాట. ఇంత దారుణమా జరిమానా—అని గుండెలు బాదుకునే దాని కన్నా పది మందికి ఉపకరించే పనులు చెయ్యడం మేలు. రూలు-అనేది ఎవరో ప్రభుత్వం వాళ్ళు ఎవరి కోసమో పెడుతున్నారు అని అనుకోకుండా సహజీవనానికి అవి సోపానాలు అని వాటిని పాటించడం మన దేశానికెంతైనా అవసరం.

ఎయిర్ పోర్ట్ టర్మినస్‌లో దిగి మా సామాను తీసుకుని టాక్సీ ఎక్కి "ఇచిగయా లూథరన్ సెంటర్"కు వచ్చాం. ఆ టాక్సీకి గేర్లు లేవు; స్పీడును బట్టి ఆటోమేటిక్‌గా పని చేస్తాయి. ప్రతి టాక్సీలో, కారులో, బస్సులో ఆఖరుకి ట్రెయిన్‌లో కూడా—ఎలక్ట్రిక్ హీటర్స్ వుంటాయి. ప్రతి ఇంటిలో విధిగా యీ కరెంటు హీటర్లు వుంటాయి. మనం వెళ్లాల్సిన అడ్రసును టాక్సీ వాడికిస్తే చాలు—ఏ మోసం లేకుండా గమ్యానికి చేర్చుతాడు. సాధారణంగా ఎవరికీ ఇంగ్లీషు రాదు. అంతా జపానీస్ భాషనే మాట్లాడుతారు. ఆ మాట

కొస్తే వేరే ఏ భాషా రాదు వాళ్ళకు. అడ్రసు కాగితాలు లేకపోతే వేరే చోటికి వెళ్లాలంటే యిబ్బందే.

టాక్సీ దిగి లోపలకు వెళ్లాం. మమ్మల్ని చూస్తూనే ఆ సెంటర్ వాళ్లు పరుగెత్తుకొచ్చి—బాగా వంగి వాళ్ళ పద్ధతిలో వందనం చెప్పారు. నేను చేతులు జోడించి "నమస్తే" అన్నాను — మెజస్టిక్‌గా। అది వాళ్ళకెలా అర్థమయిందో గాని—అంతా ముక్తకంఠంగా—వద్దు — అలా చెయ్యవద్దు — అని గోల పెట్టారు. నాతో కూడా వున్న అమెరికన్ పేరు జార్జి అల్సన్. అతను ముప్ఫయి సంవత్సరాల నుంచీ టోక్యోలో వుంటున్నాడట. అతనికి జపాన్ భాష, ఆచార వ్యవహారాలు బాగా తెలుసు. అతనికేసి చూశాను. జపాన్‌లో దేవుడి ముందే వాళ్లు చేతులు జోడిస్తారు. అది యిక్కడి పద్ధతి. నువ్విలా నమస్తే అంటే వాళ్ళను పూజించినట్టే —అంత వినయం వద్దంటున్నారు—అని చెప్పాడు. "హై. మోషి మోషి—" అన్నారంతా. ఔను—సార్" అని అర్థం. వెంటనే అందుకున్నాను. మీరు వాడే హై – మోషి మోషి—మా సంస్కృత భాషాజనితాలు. మేము మహాశయా అంటాం — ఆ మాట ఇన్ని వేల మైళ్ళు ప్రయాణం చేసే సరికి "మోషి మోషి" అయిందని చెప్పా। అంతా నవ్వారు. వాళ్లు నవ్వితే వాళ్ళ కళ్లు కనిపించవు. అసలే సగం మూసుకుపోయిన కళ్లు— నవ్వితే పూర్తిగా మూసుకుపోతాయి। పోతే ఒహటి, వాళ్లు అంతా బొమ్మల్లాగా ముట్టుకుంటే మాసిపోతారా అన్నంత నాజూకుగా వుంటారు. ఏ తేడా లేకుండా వాళ్ళంతా పసుపురంగులో వుంటారు. నల్లటి కురులు, ఎర్రటి పెదాలు, గులాబి చెక్కిళ్లు — కలం పట్టిన ప్రతివాణ్ని కవిగా మార్చే అపురూప సౌందర్య వతులు. వనితలు వేసుకునే డ్రెస్‌ను "కిమోనా" అంటారు. ఇదొక పొడుగాటి గౌనూ, వీపు మీద నుంచి క్రింది వరకు అర మీటరు వెడల్పున ఒకపట్టీవేలాడుతూవుంటుంది. గౌనూ ఈ పట్టీ ముగ్ధమనోహరమైన రంగుల్లో ఆమహిళల పట్టులాంటిఒళ్లమీద నర్తిస్తూవుంటాయి. కిమోనులు చాలా ఖరీదు-సినిమా నటీమణులు వేసుకునే కిమోనులు లక్షరూపాయల వరకూ వుంటాయట। కేశాలంకరణ కోసం ఎంత సమయం వెచ్చిస్తారోగాని — నైపుణ్యమంతా కేశాలంకరణలో కనిపిస్తుంది. ఆ మాట కొస్తే జపాన్ మహిళలు చాలా చురుకైనవాళ్లు. ఇంటి పనులన్నీ వాళ్ళే చేసుకుంటారు. మనకు మల్లే అంట్లు తోమడానికీ, ఊడ్చడానికి బట్టలు ఉతకడానికి పని మనుషులు వుండరు. ఆ పనులన్నీ వాళ్ళే చేసుకుంటారు. పనిమనిషిని పెట్టుకుంటే ఆవిడకి ఇంట్లో ఒకగది యివ్వాలట। జపాన్‌లో నిరక్షరాస్యత చాలా తక్కువ. నూటికి తొంభై మంది స్త్రీలు చదువుకున్న వాళ్లు. అందుకే ఆ దేశం అంత వృద్ధిలోకి వచ్చింది.

జపాన్ ఇళ్ళు అట్టలతోనూ, చెక్కలతోనూ కడతారని చిన్నప్పుడు వినేవాణ్ని. అలాంటివేవీ కనిపించలేదు. ఒకప్పుడు అలా వుండేవేమో. కిటికీల



# పాపాయికి అతి ఉత్తమమైనవి తల్లిపాలు

**పాపాయికి చనుబాలు ఎందుకు ఉత్తమమైనవి**

తల్లి పాలు పరిశుభ్రమైనవి, సూక్ష్మజీవులు లేనివి, పసి బిడ్డ జీర్ణ శక్తికి నూటికి నూరు పాళ్లూ అనువైనవి. వివిధ రోగాల పట్ల తల్లికి వుండే రోగ నిరోధక శక్తి చనుబాలద్వారా బిడ్డకు లభించటమే కాక, పాపాయి తల్లి ప్రేమనూ, రక్షణనూ కూడా అనుభూతి చెందుతాడు. అతడికి కడుపుకు సంబంధించిన బాధలూ, చర్మం పొక్కులు లేవడమూ కూడా సాధారణంగా రావు. 3 నెలలు నిండాక, పాలు మాత్రమే ఇస్తే సరిపోదు.

**3 నెలలు నిండాక, డాక్టర్లు ఫారెక్స్‌ను సిఫార్సు చేస్తారు.**




ఘన ఆహారాలు ప్రారంభించడం కోసం, ప్రత్యేకంగా తయారుచేయబడిన ఆహారం ఫారెక్స్. దీనిలో కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్లు ఉన్నాయి. ఫారెక్స్‌లో పుష్కలంగా ఐరన్ కూడా ఉంది. అందుకే, పాపాయి సంపూర్ణమైన పెరుగుదల కోసం ఆదర్శవంతమైన ఘన ఆహారం ఫారెక్స్.

డాక్టర్లు సిఫార్సు చేస్తారు ఫారెక్స్

**సత్వరమైన, సంపూర్ణమైన పెరుగుదల కోసం పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం**

CASGLF-11-163 TEL

మీదనో, బల్లలమీదనో రెండు మూడు పూలకుండీలు వుంటాయి. పూలను అమర్చడంలో జపానుదే పైచేయి ఇలా అమర్చే విధానాన్ని "ఇకెబాన" అంటారు. మన ఆడపడుచులు వేసే ముగ్గులు మన సంప్రదాయాన్ని ఎలా చాటుతాయో ఇకెబానకూడా అంతే అది చలి ప్రాంతం కాబట్టి వేలకొద్దీ రంగురంగుల పూలు దొరుకుతాయి. వీటిని అమర్చుకోవాలన్న అభిలాష వాళ్ళకుంది. వచ్చిన వాళ్ళకు టీ యిస్తారు. ఒక దగ్గర "జపాన్ చిరుతి డి అని పెట్టారు, జీడిపప్పులకి చాక్లెటు పౌడరు పూసినవి మన మురమురాల్లాంటివే స్వీటుగా రంగులు రంగులుగా వున్నవి వడ్డించారు. కేకులు బిస్కెట్లు వుంటాయి కాని అవన్నీ పశ్చిమ దేశాలకు సంబంధించినవి చిరుతిండి తక్కువ తింటారేమో ననిపించింది. వక్కపొడి, కిల్లీలు వాళ్ళకసలు తెలియవు

జపాను వనాలు జగత్ప్రసిద్ధాలు. క్యోటోలోనూ, మిరూజియాలోనూ, టోక్యోలోనూ కొన్ని తోటల్ని చూశాను అన్నింటిలోనూ విచిత్రమనిపించిందేమిటంటే మరుగుజ్జు మహావృక్షాలు! రెండు అడుగుల ఎత్తు, రెండు అడుగుల వెడల్పులో వుంటాయి! అలాంటి చెట్లను చూపించి దీని వయసు వంద సంవత్సరాలు, మూడొందల సంవత్సరాలు, అయిదు వందల సంవత్సరాలు— వెయ్యి సంవత్సరాలు అంటే మన మతి పోతుంది. వాళ్ళమాట మీదవున్న నమ్మకంచేత తలవూపాల్సిందేకాని మనకళ్ళతో చూసికాదు. నేను హిరోషిమాలో ఒకచోట ప్రసంగించాను. అక్కడ ఒక ఖర్జూరపు చెట్టును ఓ మూలలో తొట్టిలో వుంచారు. దీనిఎత్తు మూడడుగులు ఇలా ఏపుగా ఎదిగే చెట్లను మరుగుజ్జు వృక్షాలులా పెంచడం జపాను దేశంలో అనాదిగా వస్తున్న కళ. దీన్నే "బోన్‌సాయ్" అంటారు.

అతిథి సత్కారానికి మనదేశానికి మల్లేనే (పూర్వం) వాళ్ళది పెట్టింది పేరు. ఎంతో మర్యాద చేస్తారు. మీరు దేశంలో వున్నంతసేపు మా వాళ్లు. మీకేం కావలసినా మేమున్నాం— "యు ఆర్ అవర్ గెస్ట్—" అన్నమాటలు ఎన్నిసార్లు వినిపించాయో చెప్పలేం మాట్లాడి వెళ్ళిపోయేటప్పుడు — "సయొనారా" —అంటారు.

టోక్యోలో పెద్ద షాపింగ్ సెంటర్‌కు తీసుకెళ్ళమని మిత్రుని అడిగాను. "సుంజుకు"—అనే ప్రాంతానికి తీసుకొనివెళ్ళాడు. ఆ భవనాలను, ఆకాశ హర్మ్యాలను, అక్కడున్న షాపులను, వాటిని అమర్చిన విధానాన్నీ అక్కడ జరిగే వ్యాపారాన్ని చూసి అదిరిపోయాను. అట్లాటిదే "గింజా" అనే ప్రాంతం కూడాను. ఇక్కడ దొరకనిదంటూ ఏదీలేదు. ఒక్క తల్లి తప్ప ప్రతిదీ కొనొచ్చు. కొన్ని కోట్ల రూపాయల వ్యాపారం రోజూ జరుగుతుంది. అంతర్జాతీయంగా పేరుపొందిన సోనీ, నేషనల్, సీకో, సిటిజన్—మొదలయిన కంపెనీల షో రూములు చూసితీరాలి కొన్ని షాపులు 24 గంటలూ తెరిచే వుంటాయి. నాకు




సమయం దొరికినప్పుడల్లా "సు జూకు"కో "గింజా కో వెళ్ళేవాణ్ని. కొన్ని చోట్ల "టాక్స్ ఫ్రీ సెంటర్" అని కొన్ని షాపులు వుంటాయి. అంటే ఏమీ లేదు. మనం కొన్న వాటి మీద పన్నుపడదు. "టోక్యో టవర్" దగ్గర ఓ పెద్ద టాక్స్ ఫ్రీ సెంటర్ వుంది. అక్కడ అన్ని వస్తువులు దొరుకుతాయి. ఏ గొడవ లేకుండా ఈ సెంటర్స్‌లో షాపింగు చెయ్యొచ్చు.

ఇక "రాత్రి జీవితాన్ని" గురించి చెప్పాలంటే ఒక రాత్రి అక్కడ గడిపి తీరాలి. వెయ్యి రూపాయలు జేబులో వేసుకుంటేనే, లేకపోతే తృప్తిగా ఆ వీధుల్లో నుంచి బయట పడలేం! "పోర్నోగ్రఫీ" — విచ్చల విడిగా అమ్మేస్తారు. Adult Graphic — అనే కొట్లు సుంజుకులో చాలా వున్నాయి. అడల్ట్ గ్రాఫిక్ అంటే వయోజన విద్య అని తెలుగులో అర్థం. ఆ అర్థంతో కొట్లోకి

వెళ్లితే అంతా "నగ్న సాహిత్యమే". మామూలు పుస్తకాల షాపులు కూడా వున్నాయి.... గింజాలో పెద్ద బుక్ షాప్‌లోకి వెళ్ళాను. అయిదు అంతస్తుల్లోనూ పుస్తకాలున్నాయి. ఒక్కమూలలో మాత్రం ఇంగ్లీషు పుస్తకాలు, వాటితో బాటు జర్మన్, ఫ్రెంచి భాషల్లో పుస్తకాలున్నాయి. మిగతావన్నీ జపాన్ పుస్తకాలే— అవన్నీ జపాన్ భాషలోనేవున్నాయి. వారపత్రికలు, మాసపత్రికలూ, వందలకొద్ది వున్నాయి. ఎలక్ట్రికల్ సామానులు అమ్మే షాపులూ. ఇండస్ట్రియల్ పరికరాల షోరూములే ఎక్కువగా వుంటాయి. గింజాలో, సుంజూకు, అకసాకా, మిటాకా ప్రాంతాలలో గాంబ్లింగ్ సెంటర్స్ వుంటాయి. ఒక్కొక్క సెంటర్ సినిమా హాలంత వుంటాయి. అక్కడ జరిగే జూదం మనిషికి — మిషనుకి! అంటే — ఎలక్ట్రానిక్ కంప్యూటర్స్ వుంటాయి. వాటి ముందు కూర్చుని, స్విచ్చులు నొక్కుతూ జూదం ఆడాలి. ఇలాంటి సెంటర్స్ వందలకొద్దీవుంటాయి. వీటిని కరెంటు దీపాలతో అలంకరించే విధానం తట్టుకోలేనంతగా వుంటుంది. సిమెంటు కీకారణ్యంలో సింహం గర్జనకు భయపడి పారిపోయే జంతువుల్లా, రంగురంగు దీపాలు వెలుగుతూ. ఆకారాలు మార్చుకుంటూ మనలని హడలు గొట్టేస్తాయి. పగలుకన్న చీకట్లోనే టోక్యో అందంగా వుంటుంది — కోట్ల రంగుల దీపాల కాంతిలో!! అందుకే జపాన్ వాళ్ళను "ఎలాక్ట్రానిక్ విజర్డ్స్" అంటారు. అంటే కరెంటు మాంత్రికులన్న మాట! ఏదికావాలన్నా హాంపట్ అని క్షణంలో చేసి చూపెడతారు. వీళ్లు నిజంగానే భారీపరిశ్రమల్లో మాంత్రికులయ్యారు. చిన్నకార్ల వ్యాపారమే తీసుకోండి. టొయొటా, డాట్సన్, మాజ్డా, ల్లాంటి కారు కంపెనీలు, సాలీనా కొన్ని లక్షల కార్లను ఉత్పత్తి చేస్తాయి. నిజం చెప్పాలంటే యూరోపులో ఈ కార్లు భూతాల్లా ప్రవేశించాయి.

జపాన్ కార్ల దిగుమతి కొన్ని దేశాలలో వేలకొద్దీ పారిశ్రామిక శ్రామికులకు ఉద్యోగాలు లేకుండా చేశాయి, అంటే ఏమిటన్నమాట? వాళ్ళ దేశంలో వున్న కార్ల కంపెనీలు జపాన్ కార్ల ముందు సరితూగలేక మూతపడ్డాయన్నమాట. అలాంటి వాటిలో—బెల్జియమ్, ఫ్రాన్స్, బ్రిటను దేశాలుకూడా వున్నాయి. బెల్జియంలో 1,00,000 మందికి ఉద్యోగాలు పొయ్యాయట, హాలెండ్‌లో 50,000, ఫ్రాన్స్‌లో 4,500 మంది ఉద్యోగాలకు ఉద్వాసన తప్పిందికాదు. ఈ సంవత్సరం చివరకు ఫియట్ కారు కంపెనీ 70,000 మందికి ఉద్యోగాలుండవు అని చెప్పేసింది. తక్షణమే జపాను కార్ల దిగుమతికి అరికట్టకపోతే మరో ఆరు నెలల్లో యూరప్‌లో 1,33,000(లక్ష, ముప్పయి మూడు వేల మంది)కి ఉద్యోగాలు వుండవు. ఇప్పుడు ఈ జపాన్ కార్లూ, కలర్ టీవీలు (సోనీ కంపెనీ వాళ్ళవి విపరీతంగా అమ్ముడుపోతాయి) యూరోప్‌లో పెద్ద కల్లోలాన్ని సృష్టించాయి. అమెరికాలో అమ్ముడుపోయే సరుకులన్నీ జపాన్ వాళ్ళవేనంట! ఇతర దేశాల

పదివేలేనట. పైగా—ఆ
బొవుంటాయట. ఇంతెందుకు—ప్రపంచంలోకెల్లా మహా పారిశ్రామిక దేశంగా పేరుగాంచిన జర్మన్ దేశం జపాన్ మార్కెట్టును చూసి గడగడలాడి పోతుందట. అక్కడకూడా జపాన్ కార్లే ఎక్కువ అమ్ముడు పోతున్నాయట. ఇక సోనీ, ఇచానీ, నేషనల్, సాన్యో కంపెనీల ట్రాన్సిస్టర్లు, టీవీలు, విడియోలు చెప్పనక్కర్లేదు. జపాన్ ఇళ్ళల్లో వాళ్లువాడే ఎలక్ట్రానిక్ గాడ్జెట్లు (పరికరాలు) మంత్ర దండాల్లా వుంటాయి. ఏది కావాలన్నా చిటికెలో చేస్తాయి. వాళ్ళబొమ్మలు కూడా విచిత్రంగా వుంటాయి. వాటి వివరాలు రాయాలంటే పెద్ద పుస్తకమయి కూర్చుంటుంది.

ఒక రచయితగా, పబ్లిషరుగా నన్నక్కడకు పిలిపించారు. కాని నాకదొక యూనివర్సిటీ ఎడ్యుకేషన్‌లా మారింది. నేను ఎక్కడ మాట్లాడినా—ఏషియన్ స్పీకింగ్ —అని విపరీతంగా గౌరవించారు. ఆసియా ఖండవాసి నవడం ఒక్కటే నాకున్న క్వాలిఫికేషన్.

ఆధునిక జపాన్‌ని గురించి రాయడం మొదలెడితే ముగించడం కష్టం. టోక్యో నగరం ఎంతపెద్దది—అని ఒకరిని అడిగితే టోక్యోలో వున్న "నరిటా" విమానాశ్రయం ఒక్కటే 1065 హెక్టార్ల విస్తీర్ణం—టోక్యో ఎంతవుందో కొలవడం కష్టం అన్నారు. ఒకపక్క కరాటే, జూడో, సుమోల్లాంటి అతి ప్రాచీనమైన ఆటలు ఆడుకుంటూనే—అత్యంత ఆధునికమైన పరికరాలను ఉత్పత్తి చేస్తూ ప్రపంచ మార్కెట్టునే తారుమారు చేస్తున్న జపాన్—యాంత్రికదేశం కాదు అది మాంత్రికదేశం. అందులోనూ—రెండుచోట్ల ఆటంబాంబులు పడి, సర్వనాశనం అయిందనుకున్న దేశం—35 సంవత్సరాలలో ఇంతగా అభివృద్ధిలోకి రావడం అంటే అద్భుతం అని ఒప్పుకోక తప్పదు-హిరోషిమాలో నన్ను ఉపన్యసించమన్నారు. అక్కడ మాట్లాడుతూ — జపాన్‌మీద ఆటంబాంబు పడినా, లక్షల మంది క్షణంలో మరణించినా — పాతికేళ్ళ తర్వాత జపాన్ బాంబులు వేసింది—పారిశ్రామికంగా. అయితే ఈ బాంబులకి ఎవరూ చావలేదు, పోతే లక్షలకొద్దీ జనం బాగుపడ్డారు. ఇది ఆసియా ఖండానికే గర్వకారణం—అన్నాను.

మళ్లీ నా దేశంలో కాలుపెట్టాక నా వొళ్ళు గగుర్పొడిచింది. నా దేశంలో-నా వాళ్ళు — అన్న ధైర్యం నాలో కొండంత వూపిరిని పోసింది. పోతే — అన్ని వనరులూ వున్న ఈ దేశంలో ఎదగాల్సినంతగా ఎదగలేక పోవడానికి కారణం దొరకలేదు....

❋

# ఇంటావిడ మొగుడు

నటరాజ్ ముక్కాముల

'నేను యీ ఇంటి యజమాన్ని! .... అలా అని చెప్పే అధికారం మా'ఆవిడ నాకిచ్చింది'....

రాజేశ్వరి భర్తను ఎరిగున్న వాళ్లు అతన్నిచూసినప్పుడల్లా బహిరంగంగానే నవ్వుతారు.

ఇద్దరు పిల్లల ఆ తల్లికి భర్త.... కామేశ్వర్రావు!

అమాయకులూ .... తెలివి తక్కువ మొగుళ్లూ తెలివి గల భార్యల చేతుల్లో కీలు బొమ్మలని అనటానికి కొంచెం సబబుగానే వుంటుందేమోకానీ, నిజానికి కామేశ్వర్రావు చాలా తెలివైనవాడు. ఫస్ట్‌క్లాస్ యూనివర్సిటీ డిగ్రీ, నేమ్ ప్లేట్ మీద దాని ప్రక్కనున్న న్యాయ శాస్త్రపు మరో పట్టా అతని ఇంటలిజెన్స్‌కు నిదర్శనాలు.

'ఆఁ....ఈ రోజుల్లో డిగ్రీలు సంపాదించుకోటమూ ఓ బ్రహ్మవిద్యా?' అని తీసిపారేసే వాళ్లు....పోలీసులీ మధ్య పట్టుకున్న దొంగ సర్టిఫికెట్లు అమ్మే బావతు లాంటి వాళ్ళ దగ్గర్నుంచి అతను వాటిని కొనుక్కోలేదనీ, పాసయిన ఏ పరీక్షలోనూ అతను ఎలాంటి మాల్ ప్రాక్టీస్‌నూ ఆశ్రయించలేదనీ..నమ్మాలి! ఎందుకంటే ...ఈ రెండూ పచ్చి నిజం కాబట్టి!

కొంత మంది అంచనాలో....ఏమీఁ చేతకాని వాళ్లు భార్యా విధేయులుగా మిగిలి పోతారు. కానీ యీ కొంత మంది ప్రజాభిప్రాయాన్ని కామేశ్వర్రావుకు వర్తింపజేసే అవకాశం లేదు. ప్రతీ సిద్ధాంతానికీ ఓ మినహాయింపు వుంటుందనటానికి యిదో ఉదాహరణ. నెలకు ఎనిమిదొందల దాకా జీతం సంపాదించుకోగలిగే శక్తున్న మగాడు, ఇద్దరు పిల్లల తండ్రీ....ఏమీఁ చేతకాని వాడెలా అవగల్గుతాడు?

భయం, బిడియం, సిగ్గు....

కొందరు మగాళ్ళలోనూ యీ లక్షణాలుండటం సహజం! కామేశ్వర్రావు వ్యక్తిత్వాన్ని నిశితంగా పరీక్షించకుండానే ఈ విషయాన్ని గ్రహించొచ్చును. కానీ మనిషి కుండే ఎన్నో రకాల బలహీనతలతో పోల్చి చూస్తే, వ్యసనాలతో బేరీజు వేస్తే ... ఇవేవీ అంత ప్రమాదకరమైనవి కావు. అందుకే కామేశ్వర్రావు, ఆ ఇంట్లోని మిగతా వాళ్లూ నిర్విచారంగా జీవిస్తున్నారు.

ఇంటి యజమానురాలి మొగుడిగా ప్రవర్తించటంలో, తనకు ఆపాదించబడ్డ ఆ 'హోదా'తో రాజీపడుతూ ఎలాంటి చీకూ — చింతా లేకుండా, హాయిగా కాపురం చేయటంలో..తప్పు

అతను అభిప్రాయపడ...
గున్న వాళ్లు ఎందుకు ఎగతాళి చేస్తారో కామేశ్వర్రావుకు అర్థం కాదు.

'హెన్‌పెక్డ్' అని పిలిపించుకోటానికి ఏ మాత్రం సిగ్గుపడక పోయినంత మాత్రాన తను సిగ్గులేని వాడై పోతాడా? .... మగాడిగా బ్రతకలేకపోతాడా?

మొదటి తేదీన అందుకునే జీతాన్ని పైసల్తో సహా భార్య చేతికి ఇవ్వటంతో అతను పొందే తృప్తి పరాయివాళ్ళకేం తెలుస్తుంది? ఆయన ఆఫీసుకు వెళ్ళేప్పుడు రోజుఖర్చుకుగాను రాజేశ్వరి నిర్ణయించిన రెండ్రూపాయల్నా జేబులో పెట్టించుకుంటూ ఆమె బుగ్గల్ని ప్రేమతో నిమురుతూంటే అతని హృదయం అనుభవించే మధురానుభూతి ఆకాశపు అంచుల్ని తాకుతూంటుందని ఆ నవ్వే నాగన్నలకేం తెలుసు? రెండు టీలకయ్యే అరపై పైసలు, ఒక సిగరెట్ ప్యాకెట్‌కు ఖర్చయ్యే నూట ముప్పై అయిదూ పైసలూ పోగా .... మిగిలినఐదుపైసలబిళ్ళను సాయంత్రం ఇంటికి రాగానే బాబిగాడి సేవింగ్స్ డబ్బాలో వేసి, దాన్ని గలగలలాడిస్తూ చిన్నవాడితో కాసేపు హాయిగా ఆడుకోటంలో కామేశ్వర్రావు పొందే అనుభూతిని ఆ పరాయి వాళ్లెలా పొందగలరు?

అందుకే ఆ ఎరిగున్నవాళ్ళు అతన్ని చూసి నవ్వుతారు. కానీ అది అతన్ని బాధించదు.

కాపురానికొచ్చిన మొదటి రోజు, "ఆరోగ్యం పాడుచేసే ఈ వెధవలవాట్లు మానేయండి.... అన్న తన అభిప్రాయాన్ని రాజేశ్వరి వెలిబుచ్చినప్పుడు .... భార్య తన ఆరోగ్యం గురించి అలా అంటూందే కానీ, ఆమె ఎలాంటి ఆదేశాన్నీ జారీ చేయటం లేదనుకున్నాడు కామేశ్వర్రావు.

అతనలా అనుకోవటం తప్పా?

"పదేళ్ళ అలవాటును ఉన్న పళంగా మానుకోవటం కష్టం! అదీకాక, నాకు మరే దురలవాట్లూ లేవు. ఇదీ తగ్గిస్తాను కానీ ఇలా ఒక్కసారిగా కాదనకు రాజేశ్వరి! ...." అంటూ తను ప్రాధేయపడటంలో 'సరండర్' కావటానికి సంబంధించిన ఎలాంటి 'ఎలిమెంట్' లేకపోవటం నిజమని అతని అంతరాత్మకు తెలిసినా,

"కంపెనీ బస్సు తప్పిపోయిన రోజున కామేశ్వర్రావుసిగరెట్ కోటాలో సగాన్నైనా తగ్గించుకోవాలి.... లేదా టీ త్రాగడాన్నైనా మర్చిపోవాలి! 'రెండింటిలో ఏది?' అన్న విషయంలో తుది నిర్ణయంతీసుకునే స్వాతంత్ర్యాన్ని మాత్రం అతని భార్య భర్తకేఇచ్చింది. షి ఈజ్ నాట్ ఎ డిక్టేటర్ ఎటాల్ టైమ్స్!...." అనటం అతని కొలీగ్ విలాసరావుకు అలవాటు.

"డబ్బు దుబారాచెయ్యొద్దని నాభార్య నాకు చెప్పటం.... అప్పుల పాలు అవకుండా ఇంట్లో మాకు అవసరమైనవన్నీ అమర్చుకోవాలన్న ఉద్దేశంతోనేకానీ, నామీద పగతో కాదు కదా! " అన్న తన మనసులోనిమాటను కామేశ్వర్రావు

బైట పెట్టి, ఆ విలాస పురుషుడి నోరు మూయిస్తే బాగుంటుంది. కానీ ఆపని చేయడు.

అలా కుండ బద్దలు కొట్టినట్లు మాట్లాడితే ఎవరేమనుకుంటారోనన్న మొహమాటం కామేశ్వర్రావు నోటిని మూయించేస్తుంది. దాన్ని అవతలి వాళ్లు అది అతని చేతకాని తనంగా పరిగణించటమే కాక, ఒక్కొక్కప్పుడు రాజేశ్వరి చేతకూడా .... ప్రేమగానే— నైనా .... నోట్లో నాలిక లేనివాడిగా పిలిపించుకోబడతాడు.

భార్య ఎప్పుడైనా కూరల మార్కెట్టుకు వెళ్ళలేకపోతే తను ఆ బాధ్యతను నెత్తి నేసుకుని, అంత వరకూ అందరూ ఏరి పారేసిన పుచ్చు వంకాయలనూ, ముదురు బెండ కాయలనూ ఏరేరి, ఏ ఏటి ఒడ్డు నుంచో ఏరుకొచ్చిన గుండ్రాళ్ళతో తక్కువే తూయించుకుని, మామూలు ధర కన్నా పావు కిలోకు పది పైసల చొప్పున ఎక్కువే ముట్టజెప్పి వాటిని ఇంటికి మోసుకొచ్చినప్పుడు ....

"ఖర్మ! మీకు బేరం చేయాలంటే సిగ్గు! .... మంచివి ఏరి తీసుకోవాలంటే ఆ అమ్మే అవ్వ ఏమనుకుంటుందో, ఏం తిడుతుందోనన్న భయం! .... మధ్య వచ్చేది నేను! నా దగ్గర నోరు మెదప లేకపోయినా ఫరవాలేదు! బైటివాళ్ళ దగ్గర కూడా అలాగైతే ఎలాగండీ? ప్రతీ చోటా అంత బిడియపడితే ఎలా? .... అయినా మిమ్మల్నని ఏం లాభం?" అంటూ రాజేశ్వరి తనను తాను తిట్టుకుంటుంది.

అతనికి ఆ సమయంలో ఆమె



## రచయిత పరిచయం

పుట్టింది 1951లో, నందిగామలో. పెరిగింది ఖమ్మంలో. ఇంగ్లీష్ లిటరేచర్‌తో బియ్యే, హిందీలో రాష్ట్ర భాషా విశారద పట్టభద్రుణ్ణి. ఈ చదువుల్తో సంబంధంలేని మెకానికల్ ఇంజనీరింగ్‌లో ఐదేళ్ళ రైల్వే అప్రెంటిస్‌షిప్ తర్వాత, ప్రస్తుతం ఆరేళ్ళ నుంచీ రైల్వే డివిజనల్ కంట్రోల్, సికింద్రాబాదులో "కంట్రోల్ టిఎక్స్‌ర్"గా పని చేస్తున్నాను. నా మొదటి కథ "పాపం కిట్టూ" 1968 లో ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో ప్రచురించబడింది. అప్పటి నుంచీ అడపా తడపా రాసే కథలు అన్నీ పత్రికల్లో ప్రచురించబడుతున్నాయి.

నా ఈ కథకు ప్రత్యేక బహుమతి ఇచ్చిన జ్యోతి సంపాదకులకు కృతజ్ఞతలు!

హిమాలయాలంత ఎత్తులో .... అన్యాయాన్ని ఎదిరించేందుకు కంకణం కట్టుకుని పోరాడుతూన్న వీరవనితలా కనిపిస్తుంది.

'జనతా పార్టీ అయితేనేం? .... ఏ పార్టీ అయితేనేం?..ఎవరూ ధరలనూ, దొంగ వ్యాపారస్థులనూ అదుపులో పెట్టలేక పోతున్నారు' అంటూ ఆర్థిక వేత్తల నుంచీ అమ్మలక్కల వరకూ ఒకే రకంగా అభిప్రాయ పడుతూన్న రోజుల్లో....

కిరసనాయిలు దొరకడం .... ఎండా కాలపు శెలవు రోజుల్లో రైల్వే రిజర్వేషన్ దొరకటం కన్నా ఎక్కువ కష్టమై పోయిన ఓ సమయంలో...

తనతో పని చేస్తూన్న హోల్‌సేల్ డీలర్ బావమరిది ఒకతను రెండు డబ్బాలు బ్లాక్‌లో కన్నా కొంచెం తక్కువ ధరకే ఇప్పిస్తానంటే వెళ్ళి, సాధించి అప్పటికే చీకటి పడటంతో ఆదుర్దా పడుతూ, బేరంలో అర్ధరాత్రి అయి పోతుందేమోనన్న భయంతో....ఎదుట కనపించిన మొదటి ఆటోలో ఎక్కి కూర్చుని ఇల్లు చేరి, మీటర్ చూపినంతగా కరెక్ట్‌గా డబ్బులివ్వబోయాడు.

ఖాళీగా తిరిగెళ్లాలంటూ రెండ్రూపాయలు ఎక్కువడిగిన ఆటో డ్రైవర్‌తో

'పోనీ మరో బాడుగ దొరికే వరకూ యిక్కడే వుండిపో!' అని అనాలనుకుని, 'వెయిటింగ్ ఛార్జ్' ఇస్తానన్నా ఒప్పుకోడని తెలిసి, అతన్తో పోట్లాడే ధైర్యం లేక ఓ రూపాయి ఎక్స్ట్రాతో రాజీపడబోయాడు.

"ధర్మం యిస్తున్నారా?" అంటూ డబ్బు తీసుకోకుండా, 'బేరం లేదు' అన్న బోర్డు తగిలించుకుని వ్యాపారం చేస్తున్నట్లుగా మీటర్ మీద రెండ్రూపాయలు ఎక్కువకు ఒక్క పైసా కూడా తక్కువకు ఒప్పుకోనని పేచీ పెడుతూన్న డ్రైవర్ తో సమానంగా.... బూతు మాటలతో గొంతు చించుకుని వాదించే అలవాటూ, శక్తీలేని కామేశ్వర్రావు ఆ పరిస్థితిలో పూర్తిగా కాంప్రమైజ్ కాబోయేందుకు సిద్ధమవబోతూంటే,

"మీ లాంటి వాళ్ళను చూస్తేనే ఇలాంటి వాళ్ళందరికీ మొత్త బుద్ధేస్తుంది...." అంటూ భర్త చెవి కొరికి.

"క్యాయ్‌జీ? ఎక్స్‌ట్రాకైకూడేనా? ....మా ఇల్లేమైనా ఊరికి బయటక్కడో తగలడిందా? లేకపోతే నీ కళ్ళకు ఇప్పుడిది అర్ధరాత్రిగా కనిపిస్తూందా? కావాలంటే మీటర్ ప్రకారం తీసుకో ....లేదా పోయి ఎక్కడ చెప్పుకుంటావో చెప్పుకో! నువ్వు అరిచిగీపెట్టినా ఒక్కపైసాకూడాఎక్కువఇచ్చేదిలేదు!" ...." అంటూ హైదరాబాదీ వెరీస్పెషల్ హిందుస్తానీలో ....' సెట్‌విన్' నాన్‌స్టాప్ స్పెషల్‌రేట్ బస్సులా దూసుకుపోతూన్న రాజేశ్వరి వాగ్ధాటికి తట్టుకోలేకపోయాడు.

"తుఫానైనా ఎదురించొచ్చును కానీ .... ఆడవాళ్ళ పెత్తనం కొంప ల్నే ముంచేస్తుంది...." అని వృధాకాలయాపన మీద సణుక్కుంటూ, హ్యాండిల్‌ని టక్కుటక్కుమని రెండుసార్లు కోపంగా ఆటోను స్టార్ట్ చేస్తూన్న డ్రైవర్‌కు

"ఏం? ఆడవాళ్ళ పెత్తనంలో నీకేం

అన్యాయం జరిగింది? నీకు చేతకాదు నోటికొచ్చినట్లు వాగినంత మాత్రాన ధైర్యమూ, గుండె బలమూ, పెత్తనం చెలాయించటం, రాజ్యాలను ఏలటమూ మాత్రం మానవు! ...." అంటూన్న రాజేశ్వరి మాటలు వినిపించి వుండవు కానీ....

ఆశ్చర్యంతో నోరు తెరుచుకొనివున్న కామేశ్వర్రావుమాత్రంఇంటి యజమానురాలితో పూర్తిగా ఏకీభవించాడు.

అలాంటి ఎన్నో సమయాల్లో రాజేశ్వరి తనజీవిత కథానాయికగా అతను ఊహించుకోవటానికి కారణం తనలో లేని తెగింపు, ధైర్యము లాంటి నాయక లక్షణాలు తన భార్యలో ఉన్నట్లు గుర్తించడమూ, తను మాత్రం ప్రతి విషయంలోను చాలా ఎక్కువ మోతాదులో బిడియపడటాన్ని తెలుసుకోగలగటమూనూ.

అతని సాధారణ బలహీనతను రకరకాలుగా ఆట పట్టిస్తూ,

"భార్య ఆజ్ఞలేనిదే చీమ చేత కూడా కుట్టించుకోడు గురుడు ...." అనటం ఎంతవరకూ సమంజసమో ఆ అనే వాళ్ళకే అర్థమవ్వాలి!

"ఆవిడ అదృష్టవంతురాలు ... !" అంటూ అందుకు కొంచెం ఈర్ష్యపడిపోయే సైపిస్ట్ మెట్టింబ్లా వల్ల అతనికి ఎలాంటి నష్టమూలేదు కానీ,

"మనకూ ఇతని గాలి తగిల్తే మాత్రం చాలా ప్రమాదం ...." అని అతనికేదో అంటు వ్యాధిలాంటిది ఉన్నట్లుగా మాట్లాడుతూ ఎగతాళి చేసే మన్మధరావు లాంటివాళ్ళతోటే కొంపలం టుకుపోయేదీ, ప్రమాదాలు సంభవించేదీనూ.

అటువంటివాళ్ళ ముందు చెవిటివాడై పోవటమేఆరోగ్యకరం అందుకే కామేశ్వర్రావు సరిగ్గా అదే చేస్తాడు. ఆ మాటలను అతను లక్ష్యపెట్టక పోవడమే అతని గొప్పతనం.

రాజేశ్వరి తనకన్నా ఎన్నోరెట్లు తెలివైందనీ, ఎవరిని ఏ చెప్పుతో ఎలా కొట్టాలో తెలిసిన లోకజ్ఞానం కలదనీ కామేశ్వర్రావు దృఢాభిప్రాయం.

అందుకే తనను ఆమెతో పోల్చుకున్నప్పుడల్లా రాజేశ్వరి ఓ దేదీప్యమానంగా వెలిగే ఫ్లడ్‌లైట్‌గా ఊహించుకుంటూ... ఆమెముందు తనను తానో కిరసనాయిలు దీపంలా ఊహించుకుని, ఆమె కనుక తనజీవితంలోకి... ఉహూ, తనే కనుక ఆమె జీవితంలోకి అడుగు పెట్టి ఉండకపోతే తనబ్రతుకు ఎంతటి అంధ కారంలో అలమటించి పోతూ ఉండేదోనన్న భావన సృష్టించే బాధతో కాసేపు కుమిలిపోయాడు అంతలోనే.. తన భార్యకు ప్రధాన మంత్రి కాగలిగే అర్హత, తెలివి తేటలూ ఉన్నాయని ఎవరితోనూ అనకపోయినా, మనసులోనే రాజేశ్వరిని తనివితీరా పొగుడుతూ, ఆమెలాంటి ఆడదానికి తనను భర్తను చేసినందుకు ముక్కోటి దేవతలకూ తన కృతజ్ఞతలను భక్తితో విన్నవించుకుంటాడు ... జన్మజన్మలకూ తనను రాజేశ్వరి భర్తగా పుట్టించమంటూ.

ఇలా ప్రవర్తించటానికి కామేశ్వర్రావుకు వేపకాయంత వెర్రి వుందనడం




భావ్యమూ కాదు, రోజూ జరిగే సంఘటనలను తన కళ్లారా తాను చూడలేని గుడ్డి వాడూ కాదు. అతని లోపాలను రాజేశ్వరి తన తెలివి తేటలతో రూపుమాపుతూ సంసారాన్ని కలతలూ, కలహాలూ లేకుండా సాగేటట్లు చేస్తూందని కామేశ్వర్రావుకు ఖచ్చితంగా తెలుసు.

అతను కోరుకొనేదీ అదే!

అందుకు ఎవరి మాట ఎవరు వింటేనేం?

అలాని, నిజానికి తను చెప్పిందాని కల్లా భయస్తుడైన భర్త గంగిరెద్దులా తలాడిస్తాడు కదాని పులినోట్లో తల పెట్టమని రాజేశ్వరి భయపెట్టించదు.... అంతవరకూ వొచ్చినా, భార్యపైన తనకున్న ప్రేమతో ఆ పని చేయడానికీ వెనుకాడ్డు కామేశ్వర్రావు! తన మంచితనాన్ని అర్థం చేసుకున్న భార్యమాటను గౌరవించడం అవమానకరమని అతను ఏనాడూ భావించలేదు.

"మీకు మంచి ప్యాంట్లు మూడే వున్నాయి. వచ్చేనెల ఇంకోటి కుట్టించుకోండి" అంటూ తన ప్రతీ అవసరాన్నీ స్వయంగా గమనించే భార్యలో ఎంత వెదికినా మాత్రం ఆ భర్తకు అసంతృప్తి కలిగించే అవకాశం ఎలా

ఎదురవుతుంది?

అంతకన్నా ఏ మగాడికైనా కూడా ఇంకేం కావాలి?

"శాంతి లేనప్పుడు — అధారిటీ, అధికారం అంటూ పోట్లాడుకుంటే ఒరిగేదేముంది?" అనుకునే కామేశ్వర్రావు ఇల్లు ఓ చిన్నసైజు దేశం లాంటిదని భావిస్తాడు.

అధికార పార్టీ ఏదైనా, నాయకులు ఎటువంటి వాళ్ళయినా....దేశానికి ఏ ముప్పూ తీసుకురానంత వరకూ ఫరవా లేదు. "నేనంటే నేను" గొప్పని వాళ్ళలో వాళ్లే పోట్లాడుకుంటూ కుట్రలు పన్నుకుంటూంటేనే అందరికీ కష్టాలొచ్చిపడేదీ....అశాంతి తెలకొనేదీ!

"ఈ ఇంట్లో నా పెత్తనం నడవాలి!" అని సరదాకైనా ఏనాడూ రాజేశ్వరి పవర్ కోసం ప్రాకులాడ లేదూ.., అలా జరిగినా,

"వీల్లేదు....నేను బలవంతుణ్ణి తరతరాలుగా మా పార్టీవాళ్ళే ఈ కుటుంబ వ్యవస్థకు నాయకత్వం వహిస్తూ వచ్చారు....పదవిని నే చేపట్టాలి" అని కామేశ్వర్రావూ పోట్లాడడు.

ఇద్దరికీ కావలసింది కుటుంబ శ్రేయస్సు!

సంసారం హాయిగా గడిచిపోతూంది. ఎవరెన్ని చెప్పినా, ఎంత ఆట పట్టించినా, "సాఫీగా సాగిపోతూన్న తమ వివాహ జీవితంలో నిప్పులు కురిపించుకుంటే ఎవరికి మాత్రం లాభించేదేముంది?" అనుకోటం అతని తెలివి తక్కువతనమా?

"జీవితం ఇలా గడిచిపోతేచాలు!" అనుకుంటూ హాయిగా నిట్టూర్చే కామేశ్వర్రావును రెచ్చగొట్టడం ఎంత అమానుషం?

ఎంతో నేర్పుతో, కుటుంబ శ్రేయస్సును దృష్టిలో పెట్టుకుంటూ అన్నిటికీ సర్దుకుపోవటానికి అలవాటుపడ్డ కామేశ్వర్రావుకు....

"చేతకానివాడు"....

"కీలుబొమ్మ...." అంటూ రకరకాల రంగులు పులిమి, కథలేని రంగుల సినిమాగా రూపొందించిన వాళ్లే....ప్రేక్షకులై,

"బావుండేదు" అనీ,

"పెళ్లాం మాట వింటే శంకరగిరి మాన్యాలు పట్టిపోతావు!....పుట్టగతులుండవు! ..." అనీ,

"ఇరది మొగవాణ్ణి అదుపులో పెట్టదం సృష్టికే విరుద్ధం! స్త్రీ మగవాడి చెప్పు చేతల్లో అణిగిమణిగి వుండకపోతే.. తన అందమైన కలలన్నీ బుగ్గిలో కలిసిపోయాయని దేవుడూ కన్నీరు కారుస్తాడు. సప్త సముద్రాలూ ఏకమై ఈ భూగోళాన్నంతటినీ ముంచేస్తాయి .... ప్రళయం సంభవిస్తుంది! సమస్త జీవరాసులూ అంతమైపోతాయి! ఇంతటి ఘోరం సంభవించటం నీకు తమాషాగా ఉందొచ్చు. కానీ నువ్వు నామరూపాల్లేకుండా కొట్టుకుపోతావని మాత్రం మర్చిపోకు!" అనీ,

"నీకు సిగ్గులేదూ? నువ్వు మగాడివి కాదూ? పెళ్లాం ఆడమన్నట్టు ఆడుతూ మగజాతికే తీరని కళంకం తీసుకొస్తు




న్నావు!... ఛీ ఛీ...." అనీ ...

సరదాకో, సీరియస్‌గానో అతన్ని రెచ్చగొట్టేవాళ్ళు ఆ భార్యా భర్తల సుఖశాంతుల్ని దోచుకోడానికి ప్రయత్నించే బందిపోటు దొంగలూ, ద్రోహాలూ కాక మరేమవుతారు?

వాళ్ళను శత్రువులనీ, దోపిడిగాళ్ళనీ కాక మరేమనాలి?

"మీసా" లాంటి ఓ చట్టాన్ని ఇటువంటి వాళ్ళకోసం జారీచేసి, మీసాలు మెలేసే ఈ రకం వాళ్ళందరినీ బొక్కలోకి తోసేస్తే ప్రాణం హాయిగా వుండదూ?

"మేం ఇద్దరం ఓ అవగాహనకొచ్చి హాయిగా బ్రతుకుతున్నాం! మధ్యలో మీకెందుకండీ కళ్ళల్లో నిప్పులు?" అని ఆ భార్యాభర్తలు రోడ్డెక్కి బహిరంగంగా వీళ్ళ మొహాల మీద అడగలేరనేనా వీళ్ళందరి ధైర్యం?

లేక,

ఈ గాలి యిలా వ్యాపిస్తూంటే కొన్నాళ్ళలో ఆడవాళ్ళంతా ఏకమై,

"ఇనాళ్లూ మేం భర్తల అడుగులకు మడుగులొత్తాం! ఇక ఈ నిరంకుశత్వాన్ని సహించం! . ఇక నుంచీ కొన్నేళ్ళపాటు ఈ అధికారాన్ని మేం చేజిక్కించుకుంటున్నాం." అని విప్లవాన్ని లేవదీసి, మగాళ్ళందరినీ ఖైదీలుగా బంధి

ని భయమా?

ం ం ం

"అలా ఉన్నారేం?"

ఆ రోజు సాయంత్రం ఆఫీసు
చి వచ్చిన భర్త నీరసంగా పడ
ర్చీలో వాలుతూండగా అడిగింది
శ్వరి.

"ఏం లేదు, కొంచెం తలనొప్పిగా
దంతే!" చేతి గడియారం తీసి
క్కనున్న స్టూల్ మీద పెడుతూ
ప్పాడు కామేశ్వరావు.

అలవాటు ప్రకారం గడియారాన్ని
ముకోవటానికి చెయ్యి జాపి భార్య
ె వంకే చూస్తూండి పోయింది.
ఈ మధ్య భర్త మునుపటిలా
ండా, అదోలా....మరీ ముభావంగా
కటాన్ని ఆ ఇల్లాలు ఆయోమయంగా
నిస్తూనే వుంది. ఇంటికి
నే తండ్రి తమను దగ్గర కు
కుని ఆడిస్తూ కబుర్లు చెబుతాడని
గో ఎదురుచూసే పిల్లలు కూడా
-మొహంతో, నిరాశ నిండిన
ఫుల్ని మొహాన పులుముకుని తండ్రి
ి ప్రవర్తనను అర్థంచేసుకోగలిగే
లేని వాళ్ళయి ఇంటి నలు మూలలా
వాళ్ళలా తచ్చాడుతూండడం ఇంకా
ా వుందా తల్లికి. అతన్లో ని
ర్పుకు కారణమైన దారుణాన్ని
కూ ఊహించలేక పోతుంది
శ్వరి.

, రాత్రి భోజనం దగ్గరకూడా
ఆలోచిస్తున్నవాడిలా రెండు మెతు
కెలికి, ఆ పని పూర్తియిందని
ాడు కామేశ్వరావు. అతనికి
ఎంతో ఇష్టమైన కొబ్బరిపచ్చడిని అలా
కనీసం రుచైనా చూడకుండా లేచిపోవ
డం భార్యకు ఆశ్చర్యాన్నీ, బాధనూ
కలిగించాయి,

పిల్లల్నిద్దరినీ పడుకోబెట్టి, రెండు
చేతుల్నీ తలక్రింద పెట్టుకొని మంచం
మీద నిటారుగా పడుకుని ఏదో తీవ్ర
సమస్య గురించి దీర్ఘాలోచనలో ముని
గిపోయినట్లున్న భర్తప్రక్కగానిలబడి.

"కోపమా?" అని జీర బోయిన
గొంతుతో అస్పష్టంగా గొణిగింది
రాజేశ్వరి,

అప్రయత్నంగా కళ్ళు తెరిచి ఆమె
వంక చూసాడతను.

"తెలీక నేను ఏదైనా తప్పు
చేసుంటే.... అందుకు విధించేది ఇంత
చిన్న శిక్షేనా?...." ఇక ఆ ఎడబాటును
భరించలేనట్లు ఆమె అతని గుండెల
మీద వాలిపోతూ వెక్కి వెక్కి ఏడ్చింది.

ఊహించని ఆ పరిస్థితిని వెంటనే
ఎలా ఎదుర్కోవాలో తెలీక....ఆ గం
భీర వాతావరణాన్నిఎలా తేలియపర్చాలో
తోచక....సంభాషణ నెలా మొదలు
పెట్టాలో అర్థంకాక సతమత మవు
తున్నాడు కామేశ్వర్రావు.

"ఉహూఁ! నీ తప్పేమీ లేదు రాజీ!
మన అన్యోన్యతను చూసి ఓర్వలేని
వాళ్ళ వాగుడు . విని మతి చలించి
నేనే తప్పుగా ప్రవర్తిస్తున్నాను.....
ఇంకెప్పుడూ అలా జరగదు! ఒట్టు!"
అనుకుంటూ తను అవతలకు జగిరి,
రాజేశ్వరికి తన ప్రక్కన ఎక్కువ
చోటిచ్చాడు కామేశ్వర్రావు!

తెలివైనవాడు కాకపోతే?!.... ❋




# కాల్గేట్ టూత్ పౌడర్‌తో మీ చిగుళ్ళను, చెడుశ్వాసను కూడా అరికట్టండి పళ్ళను కాపాడుకోండి.






కోల్గేట్ టూత్ పౌడర్ ఎంతో మెత్తగా ఉండే తెల్లని పౌడర్. అది అతి మృదువుగా మీ చిగుళ్ళను తోముతుంది. అంతేగాకుండా దానిలో ఉండే సున్నితమైన మెరుగునిచ్చే పదార్థం మీ పళ్ళ మీది పాచిపొరలను తొలగిస్తుంది. మీ పళ్ళను శుభ్రపరచి తెల్లగా చేస్తుంది. కోల్గేట్‌లోని పుష్కలమైన నురుగునిచ్చే చర్య పళ్ళ సందులలోనికి చొచ్చుకుపోయి చెడు వాసనను దంతక్షయ కారకములైన సూక్ష్మ క్రిములను తొలగిస్తుంది.

**మీ కుటుంబానికి కోల్గేట్ టూత్ పౌడర్‌తో అధునాతనమైన తీరులో దంతరక్షణ సమకూర్చండి. దానియొక్క చల్లని, పిప్పర్‌మెంట్ రుచిని వారంతా మెచ్చుకుంటారు.**

TP.G. 30 TL

# సామ్రాజ్యం తిరిగిరాదు!

ప్రతాప రవిశంకర్

సామ్రాజ్యం చీకట్లో కలిసిపోయి నిల్చుంది. ఆమె పక్కనే వున్న చిటికేశ్వరపు చెట్టు పొట్టి రాక్షసిలా నిలబడి గాలికి చిన్నగా వూగుతోంది.

చేతిలో వున్న సూట్కేసును చెట్టు వారగా వుంచి ఒక్కసారి బరువుగా నిట్టూరుస్తూ దూరంగా కనపడుతున్న వూరికేసి చూసింది. పైర్లు కోసెయ్యడంవల్ల అడ్డులేక వూళ్ళో ఇళ్ళన్నీ శిలలుగా మారిపడివున్న మనుషుల్లా కనిపించాయి. అక్కడా అక్కడా ఇళ్ళలో నుంచి బయటకు కనబడుతున్న నూనె దీపాలు బాగా, తాగినవాడి కళ్ళలా ఎర్రగా వున్నాయి.

టైమెంతయిందోననుకుంది సామ్రాజ్యం. తను బయల్దేరినప్పుడు ఏడు గంటలు కావస్తోందని చెప్పాడు రేడియోలో. తను మైలున్నర నడిచి స్టేషనుకు వచ్చింది. ఎనిమిది గంటలకు రైలు వస్తుందని తనకు తెలుసు. రైలు రావడానికి ఐదు నిమిషాలు ముందే గంట కొడతారు. ఇంకా గంట కొట్టలేదు. అంటే రైలు రావటానికి ఇంకా టైమున్నది.

ఒక్కసారి తలతిప్పి ఆ చిన్న స్టేషన్ కేసి చూసింది. ఎవరో విమానంలో వెళుతూ కిందకు జార్చిన ఏదో వస్తువులా అనిపించింది. లోపల స్టేషన్ మాస్టరు గదిలో వెలుగుతున్న దీపం ఎవరికో భయపడుతున్నట్టుగా అటూ ఇటూ కదులుతోంది. కర్ఫ్యూ విధించినట్టుగా ప్రశాంతంగా వుంది ఊళ్ళోని సందడి అప్పుడప్పుడు వినిపిస్తోంది.

"నేనొక్కదాన్నేనా" అనుకుంది సామ్రాజ్యం. సాధారణంగా ఆ స్టేషన్లో రాత్రిపూట రైలుకి ఒకరిద్దరు ప్రయాణీకులకంటే వుండరు.

ఎవరయినా వస్తున్నారేమోనని తను నడిచివచ్చిన దారికేసి కళ్లు చిట్లించి చూసింది సామ్రాజ్యం.

ఎవరో గబగబా నడిచి వస్తున్నట్టుగా అనిపించి కనులను మరింత చిట్లించి చూసింది. నిజమే..ఎవరో వస్తున్నారు. దూరంనించి ఆడో, మగో తెలీలేదు.

"విశ్వనాథం కాదుగదా" అనుకుంది.

అతనే ఐతే బావుండు... అసలు సాయంత్రానికే వస్తానని చెప్పాడు పూర్ణించి... అందుకే తను మధ్యాహ్నం రైలుకి వెళ్ళకుండా అతనికోసం ఎదురు చూసింది. కానీ రాలేదు. ఏదో పనుండి వుండిపోయాడనుకుని తప్పనిసరయి బయల్దేరింది. బహుశ ఇంతకు ముందే పక్కవూరి వరకు బస్సులో వచ్చి అక్కడినుంచి ఏ బండిలోనో



వచ్చివుంటాడు. రాగానే తను తిః రైలుకి వెళుతున్నట్టు తెలిసిందేమో....

సామ్రాజ్యం ఇలా ఆలోచిస్తుండగానే ఆ వస్తున్న మనిషి స్త్రీ అని తెలిసిపోయింది.

ఆమె చేతిలో పెద్ద సూట్కేసు వుంది. ఆ సూట్కేసు ఆమె చేతిలో లేకుండా వుంటే ఇంకా వేగంగా నడిచేదేమో అనుకుంది సామ్రాజ్యం.

ఆమె ఎవరో సామ్రాజ్యం గుర్తించలేక పోయింది. గబగబా రైలుపట్టాలు దాటివచ్చి స్టేషన్ ముందు చిటికేశ్వరపు చెట్టుకు ఆవతలగా సామ్రాజ్యానికి కొంచెం దూరంలో నిలబడింది—సూట్కేసును కిందవుంచి.

"ఎవరీమె?" అనుకుంది సామ్రాజ్యం. పలకరించుదామా అనుకుని ఎందువల్లనో ఆ ప్రయత్నాన్ని

మానుకుంది.

ఆమె పమిటకొంగుతో మొహానికి, చేతులకు పట్టిన చెమటను తుడుచుకుని ఒకసారి రైలువచ్చేదిశగా చూసి, స్టేషను మాష్టరు గదిలోకి వెళ్ళింది.

ఆమె మాటలు సామ్రాజ్యానికి సరిగా వినిపించలేదు. కాని-స్టేషను మాష్టరు గొంతు స్పష్టంగానే వినిపించింది.

"ముప్పావు గంట లేటు తల్లీ"

భారంగా అడుగులు వేస్తూ బయటకు వచ్చిందామె. వచ్చి సూట్కేసు పక్కనే నిలబడింది.

సామ్రాజ్యం ఆమెనే చూస్తున్నది. ఆమె మొహం చీకట్లో సరిగా కనిపించ డంలేదు. ఎవరై వుంటుందానుకున్నది. ఎవరయినా ఇలా చీకట్లో అంతపెద్ద సూట్కేసుతో ఒంటరిగా వస్తుందా??

ఒకవేళ ఇంట్లో ఎవ్వరికీ చెప్ప కుండా వస్తున్నదేమో....ఏమో....ఐ వుండ వచ్చు ...ఇంతకీ పెళ్ళయిందా? వెళ్ళి మాట్లాడితే?? తెలిసిపోతుంది..

ఆమె భయపడుతుందేమో తన ప్రయాణం తెలిసిపోయిందని....

చలిగాలి తివ్వన ఒక్కసారి గట్టిగా వీచింది. వెన్నులోనించి సామ్రాజ్యా నికి వణుకు పుట్టింది. పమిటను చెవుల మీదగా లాక్కుని వంటి చుట్టూ తిప్పు కుంది.

చిట్రేశ్వరపు చెట్టు అటూ, ఇటూ గట్టిగా వూగింది ఎవరో కుదిపినట్టు.

సామ్రాజ్యానికి కాళ్ళు నొప్పులు పుట్టాయి. సూట్కేసును వాల్చి, దాని మీద కూర్చుందామనుకుంది.

ఇంతలోనే స్టేషన్ ముందు నిల్చు న్న ఆమె చిన్నగా ఏదో మాట్లాడటం వినిపించింది-ఆమెకేసి చూసింది.

ఆమె స్టేషన్కు వచ్చే దారివైపు చూస్తోంది.

ఎవరో సిగరెట్టు కాలుస్తూ వేగంగా వస్తున్నారు....

ఆ మనిషి కొంచెం దూరంలోకి వచ్చిన తర్వాత ఆ నడక చూసి అత నెవరో సులభంగానే గుర్తు పట్టింది సామ్రాజ్యం....

అతను విశ్వనాధం—

'ఐతే తను స్టేషన్ కు వచ్చినట్టు తెలుసు కున్నాడన్న మాట' అనుకుంది సంతోషంగా....

అతనితో చెప్పకుండా వెళ్ళిపోతున్న దనీ, పనయిపోగానే వెంటనే వూరికి తిరిగి వచ్చేయ్యాలనీ అనుకుంది. ఇప్పు డు యింకో రెండ్రోజులు అక్కడే వున్నా ఫర్వాలేదు..కాని యింకో రెండు రోజులు-మొత్తం వారం తను అక్కడ వుండటానికి విశ్వనాధం వొప్పు కుంటాడా?

ఒక్క రోజు కూడా తన ఇంటికి రాకుండా తనని చూడకుంటా వుండ లేని విశ్వనాధం తన వారం రోజుల ఎడబాటుని ఎంత మాత్రం సహించ లేడు.

తను మాత్రం సహించగలదా? తన బ్రతుకు మీద తనకి జాలి, అసహ్యా మూ వుండొచ్చు .... తను తప్పు డు మార్గంలోనే నడుస్తూ వుండొచ్చు కాని విశ్వనాధంని వదిలి తను ఎందువల్లనో దూరంగా వెళ్ళలేకపోతోంది.

ఎందువల్ల?

చాలా వరకు కృతజ్ఞతే ... ఆ పైన వుంటే ప్రేమ. అదీ ఎక్కువగా కృతజ్ఞత వల్ల. అతను తనని ప్రేమించటం వల్ల ఏర్పడిన ప్రేమ.

నిజానికి అతను తనని ఎలాంటి స్థితి నించి బయటకు లాగి ఓ దారి చూపించాడు?

కట్టుకున్న మొగుడికి తన అవసరం ఎప్పుడో గానీ లేకపోయింది. ఇక మిగిలింది తనకు ప్రతి రాత్రీ నరకమే.

ఆ నరకాన్ని భరించే శక్తిని కోల్పోయి ఆ కొంపలో నించి బయటపడివచ్చి చావటం ఇష్టంలేక ఎటుపోవాలో తెలీక దిక్కుతోచక తిరుగుతున్నప్పుడు కనిపించాడు విశ్వనాథం. తన పరిస్థితి అతనితో ఏ మాత్రం సంకోచించకుండా చెప్పుకుంది. అతను తనని చులకనగా చూడలేదు ఒకప్పుడు అతను తమ పక్కింట్లో వున్నప్పుడు తనని ప్రేమించాడు. ప్రేమలేఖలు రాశాడు. అవి ఇంట్లో చిక్కి, తాము ఆ యిల్లు వదిలి పోవటానికి కారణమయ్యాయి. నిజానికి అప్పట్లో తనకీ విశ్వనాథం మీద ప్రేమలేదు-ఎందువల్లనో, ఆ విషయం అతనికి తెలుసునో? తెలీదో? ఆనాటి విషయాలను మనసులో వుంచుకోకుండా తనని తనతో ఆ వూరికి తీసుకెళ్లాడు. తనచేత ప్రయివేటు బడి పెట్టించి పిల్లలను చేర్చి తనకో బ్రతుకుతెరువు, జీవితం మీద ఆశను చూపించాడు. ఆ క్షణమే తను విశ్వనాథానికి లొంగిపోయింది.

అప్పటినించీ ఈనాటివరకూ అంతే. తన సర్వస్వమూ అర్పించుకున్నది. ఇప్పటివరకూ తన ఆలనా పాలనా విశ్వనాథమే చూసుకుంటున్నాడు ...

దగ్గరకు వచ్చేశాడు విశ్వనాథం ... అతనికి కనిపించేలా ముందుకు రాబోయి తక్కున ఆగిపోయింది సామ్రాజ్యం.

విశ్వనాథం రావటంతోనే స్టేషన్ ముందు నిలబడివున్న ఆమె దగ్గరకు నడిచి "శ్యామలా" అనిపిల్చాడు.

ఉలిక్కి పడింది సామ్రాజ్యం.

ఆమె శ్యామలా? విశ్వనాథ భార్య.. ఎందుకలా వెళ్ళిపోతోంది? ?

"నువ్విలా తొందరపడతావనుకోలేదు శ్యామలా" అన్నాడు విశ్వనాథం చిన్నగా ఆమె దగ్గరకు జరిగి..

ఆమె మాట్లాడలేదు. మౌనంగా వుండిపోయింది.

సామ్రాజ్యం చెట్టు చాటుకు సర్దుకుని నిల్చుంది.... వాళ్ళ మాటలు బాగానే వినిపిస్తున్నాయి ...

"నాతో పూర్తిగా తెగతెంపులు చేసుకుందామనే యీ ప్రయాణం" విశ్వనాథమే అంటున్నాడు....

ఆమె పెదవి కదపలేదు....

"నీకిది న్యాయంగా వున్నదా శ్యామలా"

"మీరు నాకు అన్యాయం చెయ్యటం మీకు న్యాయంగా వుందా?" కోపంగా అన్నదామె.

"సామ్రాజ్యం గురించేగా నువ్వ

వైజయంతి కంబైన్స్



# గురుశిష్యులు

కలర్

దర్శకత్వం: కె. బాపయ్య

నిర్మాత: సి. అశ్వనీదత్ B.Sc.

కె.వి. మహదేవన్



లక్ష్మీ ఫిలింస్

LAKSHMI PUBS.

నేది."

"అంతకుమించి నాకు నరకం ఏం కావాలి."

"ప్లీజ్ .... నన్నర్థం చేసుకో శ్యామలా."

'మీరనేదేమిటి? నేను ఆమెతో గడుపుతాను....నువ్వు నోరు మూసుకో అంటారు. అంతే కదా!"

విశ్వనాధం మాట్లాడలేదు.

అతని మౌనాన్ని ఆసరాగా తీసుకుని ఆమె మరింత ఆవేశంగా మాట్లాడింది.

"నేనెంత క్షోభను అనుభవిస్తున్నానో అర్థం చేసుకునే ప్రయత్నం ఎందుకు చెయ్యరు? మీకిది చాలా సహజంగానే వుండొచ్చు. మీరిలా చెయ్యటానికి మీలో మరో స్త్రీకి భాగమివ్వటానికి నాలో లోపమేమీలేదు. నాలో ఏదయినా లోపముండి మీకు న్యాయం చేకూర్చలేనప్పుడయితే మీరిలా చేస్తుంటే నోరు మూసుకుని పడివుండేదాన్ని. మన పెళ్ళిఅయి ఎన్నాళ్ళయింది? ఏడాది దాటింది .. అప్పుడే నేనంటేమీకు ఇష్టం పోయిందా? ఏదో వ్యామోహంలో వున్నారని మొదట్లో మంచిగా చెప్పాను. మీరు నామాటను పట్టించుకోలేదు.... ఇప్పుడు మీరు పూర్తిగా నా చెయ్యి దాటిపోయేలా కనిపిస్తున్నారు. ఇక నేను భరించలేను " ఆమె ఆగింది.

సామ్రాజ్యం వూపిరి బిగబట్టి ఆమె మాటలను వింటోంది. మనసంతా అదోలా ఐపోయింది. ఇంతకుముందే తన కారణంగా తనకీ ఆమెకీ మధ్య కొంత ఘర్షణ జరుగుతున్నట్టుగా చెప్పాడు విశ్వనాధం. తను బాధపడింది. ఐనా విశ్వనాధాన్ని వదల్లేకపోయింది. అది తన బలహీనతే.

ప్లీజ్....నన్ను అర్థం చేసుకోటానికి ప్రయత్నించు శ్యామలా..సామ్రాజ్యం మంచి మనిషి. ఒకప్పుడు నేను ఆమెను ఎంతగానో ప్రేమించాను. పెళ్లికూడా చేసుకోవాలనే అనుకున్నాను. కాని కుదర్లేదు... సామ్రాజ్యాన్ని మొదటిసారిగా ఈస్థితిలో చూసినప్పుడు గుండె తరుక్కుపోయింది. ఇక్కడకు తీసుకొచ్చాను... సామ్రాజ్యానికీ నాకూ మధ్య శారీరక సంబంధమే ముఖ్యమయినదికాదు .. సామ్రాజ్యం దగ్గరకు వెళ్ళొచ్చు. కాని అంత మాత్రాన నీకు అన్యాయం చేస్తానని అనుకోకు . నీకెలాంటి భయమూ లేదు....వచ్చెయ్ ... వెళ్ళి పోదాం ... "

"మీరు ఎన్నయినా చెప్పండి .మీరు ఆమెతో సంబంధం పూర్తిగా తెంచుకున్న రోజునే నేను ఆ ఇంట మళ్ళీ కాలుపెడతాను.... నేనో, ఆమో నిర్ణయించుకోండి... ఒక వరలో రెండు కత్తులు ఇమడవు....నేనిలా అడుగుతున్నానని ఏమీ అనుకోకండి....ఆమే నా పరిస్థితిలో వుంటే మీరిలా చేస్తుంటే ఒప్పుకునేదేనా? మీకు తెలీదనుకోను. తన భర్తను మరో స్త్రీ పంచుకోవడాన్ని ఏ స్త్రీ సహించలేదు. మీరు చేస్తున్న పనే నేను చేస్తే మీరెలా ఫీలవుతారు?"

# ఉన్నపాటునే రండి

పాపములో పడిపోయిన పాపి, ప్రభు పాదముల యొద్దకు వచ్చుటకు కొం
పాటు కావలెనని అనేకమంది తలంచుతుంటారు దేవుడు పరిశుద్ధుడు, మంచివాడు
ఆయన సన్నిధికి రావలెనను కొంటె, మొట్టమొదటిగా, కొంతవరకైన మంచివార
శుద్ధులుగా మారాలనే తప్పు అభిప్రాయం అనేకమందిలో పేరుకు పోయింది.
చెప్పాలంటే దైవసన్నిధికి చేరుటకు ఇటువంటి సిద్ధబాటులేవి దేవునికి అవసర
దేవుని పవిత్రతతో పోల్చిచూస్తే, తానెంత అపవిత్రుడో, తానెంత అయోగ్యు
మానవుడు గుర్తించగలిగితే, మిగిలిన సంగతులన్నీ దేవుడే సరిచేయగలడు.
గ్రస్తుడు వైద్యుని అవసరం గుర్తించినట్లు. పాప వ్యాధిగ్రస్తుడు కూడా తన
గుర్తించి, ప్రభు పాదములను పట్టినప్పుడు, ఆ ప్రభు వాడి అపరాధ లను క్ష
వాని దోషములను పరిహరించి, వానిని పరిశుద్ధునిగా మార్చగలడు.

హృదయంలో ఒక్క పాపపు తలంపైన పొడచూపని మానవు లెవ్వర
చెప్పండి. అలా ఒక్క పాపపు తలంపైన లేకుండ దేవుని నీతికి, పరిశుద్ధ
మాగినవాడు యేసుక్రీస్తు ఒక్కడే. అందువలన దేవుడు మానవుల పాపముల
కుమారుడైన క్రీస్తునందే క్షమించగలడు.

"యేసు" అనగా రక్షకుడు. నన్ను మిమ్ములను పాపమునుండి రక్షి
అవతరించినవాడు. వారి వారి పాపపు దుస్థితిని గుర్తించి, పశ్చాత్తాపముతో,
ముతో, తన యొద్దకు వచ్చే ప్రతిపాపిని, ఆ ప్రభు కృపతో క్షమించి, అతని
యమును తనపరిశుద్ధ సన్నిధితో నింపి, వారిని నిత్యజీవమునకు పాత్రులుగా చేయ

మీరెటువంటి ఘోరపరిస్థితులలో నున్ననరె, ఉన్నపాటునే ప్రభుయొద్దకు
తనయొద్దకు వచ్చేవారిని ఆ ప్రభు ఎన్నడూ త్రోసివెయ్యడు నశించిన వారి
రక్షించుటకే క్రీస్తు ఈ లోకములో అవతరించాడు.

—చదలవాడ చంద్రమౌ

**ఉచితం !**

దైవస్వరూపుని దివ్యచరిత, ఆయన కమ
నీయ బోధలు తెలిపే అందమైన పుస్తకం
ఉచితంగా పొందదలచుకుంటే మీ చిరునామా
ఈ రోజే మాకు వ్రాయండి. పోస్టుఖర్చులు
మేమే భరించి ఉచితంగా మీకు పుస్తక
పంపుతాము.

**ఉచితం !**

డా॥ ఎస్. జాన్ డేవిడ్, డి
ఫార్ కార్నర్స్,
పోస్టుబాక్స్ నెం. 4
చిలకలూరిపేట
గుంటూరు జిల్లా.

GOSPEL MESSAGE INSERTED BY FARCORNERS

"శ్యామలా"

సామ్రాజ్యం అదిరి పడింది....

కోపం తెచ్చుకోగానే సరికాదు. ఎదుటి మనిషిని అర్థం చేసుకునే ప్రయత్నం చెయ్యండి...

విశ్వనాథం వెంటనే మాట్లాడలేదు.

స్టేషన్లో రైలు రాబోతున్నట్టుగా గంట కొట్టారు...

"ఇంటికి వెడదాం పద" అన్నాడు విశ్వనాథం ఆమె భుజం మీద చెయ్యి వేసి

"సారీ... నేను రాలేను. మా ఇద్దర్లో మీకు ఎవరో ఒకరే కావాలి.. చెప్పండి త్వరగా....రైలు వస్తోంది"

ఊపిరి బిగ పట్టి విశ్వనాథం చెప్ప బోయే మాటల కోసం ఎదురుచూసింది సామ్రాజ్యం

అతనికి ఎవరు ముఖ్యం??

భయపడింది—తనే కావాలని చెబుతాడేమోనని తనుతన స్వార్థమే చూసుకుంది. మరో ఆడదాన్ని కన్నీటి గురించి తను అంతగా ఆలోచించలేదు .. ఐతే విశ్వనాథం తన మీద వ్యామోహంలో వున్నాడు. ఇప్పుడు తనే తనకు కావాలంటే? ఆమె బ్రతుకు??

దూరంగా రైలు వస్తున్న చప్పుడు వినిపిస్తోంది.

సామ్రాజ్యం గుండెలు అదురుతున్నాయి.

"త్వరగా చెప్పండి...."

"నువ్వే గెలిచావు శ్యామలా... పద...వెళ్ళిపోదాం.." అన్నాడు సూట్కేసును అందుకని....

సామ్రాజ్యానికి ఏడుపు రాబోయి ఆగిపోయింది.

వాళ్ళకేసి చూసింది ...ఎడమ చేతిని భార్య భుజం మీద వేసి కుడి చేత్తో సూట్కేసు పట్టుకుని పట్టాలు దాటుతున్నాడు విశ్వనాథం.

ఆ దృశ్యం చూస్తూంటే ఒకవైపు సంతోషమూ మరో వైపు దుఃఖమూ కలిగాయి ...

కళ్లు తుడుచుకుని ముందుకు నడిచింది సామ్రాజ్యం ...

టిక్కెట్టు తీసుకుని వచ్చేసరికి స్టేషన్ లోకి వచ్చింది రైలు.

ఇద్దరు మనుషులు దిగారు.

ఖాళీగా వున్న ఓ పెట్టెలో ఎక్కి ఓ మూలగా కూర్చుంది సామ్రాజ్యం.

పెద్ద చప్పుడుతో ముందుకు కదిలింది రైలు.

బయటకు చూసింది సామ్రాజ్యం. శిలల్లాంటి ఇళ్లు-ఆ ఇళ్ళవయిపు నడచి వెళుతున్న ఆ ఇద్దరూ అస్పష్టంగా కనిపించారు.

రైలు వేగం అందుకుంటోంది. ఊరు దూరమవుతోంది.

'ఇప్పుడేమిటి దారి?' అనుకుంది సామ్రాజ్యం ఇప్పుడు సామ్రాజ్యం మనసులో ఇక ఆ వూరికి తిరిగి వచ్చే ఆలోచనే లేదు.





## ఆక్రోష్

దర్శకుడు, ఛాయాగ్రాహకుడు
—గోవింద్ నిహలాని
నిర్మాతలు-దేవీదత్, నారాయణ్ కున్ని
కథ, స్క్రీన్ ప్లే-విజయ్ తెందూల్కర్
సంగీతం—వర్మన్

నసీరుద్దీన్ షా (భాస్కర్ కులకర్ణి) స్మితాపాటిల్ (నాగి) అమ్రీష్ పురి (దుస్సేన్) ఓమ్ పురి (లాహన్యభికు)

---

మానవ జీవితంలో ఏ సమస్యా పూర్తిగా వ్యక్తిగతమైంది కాదు. ఎక్కడో అక్కడ దానికి సాంఘికమైన సంబంధ, పునాది వుంటాయి. ఉన్నా అల్లా ప్రమాణంలోనే.

**గిరిజన ప్రాంతంలో ఓ గ్రామంలోని లాహన్యభికూ కథ ఆక్రోశ్.** కేవలం ఒక గిరిజనుడికి, అతని పేదరికానికి, అతనికి ఎన్నో రకాలుగా జరిగిన అన్యాయానికి మాత్రమే పరిమితం అయిన కథకాదు. కొన్నిలక్షల, కొన్ని కోట్ల బాధార్తుల ఆక్రోశం. వ్యక్తిగత స్థాయిలో భికూ బాధ, సమాజస్థాయిలో ఓవర్గపు ఆర్తిగా, ఎలా ఎదిగిందో అద్భుతంగా చిత్రించిన కథా కావ్యం 'ఆక్రోశ్.'

సభ్య సమాజంలో జన జీవితాన్ని నియంత్రించే రెండు బలమైన శక్తులు ఆర్థిక వ్యవస్థ, న్యాయ వ్యవస్థ. ఈ రెండింటికీ మధ్య వున్న ప్రత్యక్ష పరోక్ష సంబంధాల్ని సునిశితంగా, సున్నితంగా విశ్లేషించటం ఆక్రోశ్ చిత్రం గొప్పదనం.

భార్యని చంపి వూళ్ళోని పాడుపడిన బావిలో పారేశాడన్నది భికూ మీద నేరారోపణ. భార్య చితికి నిప్పంటించి, జరుగుతున్నదాన్ని నిస్సహాయంగా చూస్తున్న భికూ చట్టానికి బందీగా జైలు దేరటంతో సినిమా ఆరంభమవుతుంది.

ఆర్థికస్తోత లేని కారణంగా, ధర్మ రీత్యా వుదారంగా ప్రభుత్వం భికూ తరపున నియమించిన లాయర్ భాస్కర్ కులకర్ణి అతనికి సీనియర్, యించుమించుగా గురువులాంటివాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్ దుస్సేన్. భాస్కర్ కులకర్ణికి యిదే మొదటికేసు. ఉత్సాహం, ఆతృత, పట్టుదల, కొద్దిగా కంగారు. భికూకి న్యాయం చేకూర్చా



పూర్ణోదయా మూవీ క్రియేషన్స్‌వారి "సీతాకోకచిలుక" ముహూర్తం సందర్భంలో నిర్మాత ఏడిద నాగేశ్వరరావు, దర్శకులు భారతీరాజా.

---

లన్న తపన....యిదీ భాస్కర్ పరిస్థితి

తనూ గిరిజనుడే అయినా యీనాటి సభ్య సమాజంలో గౌరవంగా మెలిగే గొప్పగా గుర్తించబడే పెద్ద మనుషుల స్థాయికి ఎదిగిన పెరుగుదల, వర్గ ప్రయోజనం. మరోవేపు తనకి చదువు చెప్పించి లాయర్నిచేసిన భాస్కరులకర్ణి తండ్రిపట్ల విశ్వాసం, దాని కారణంగా భాస్కర్‌పట్ల అభిమానం....యిదీ పబ్లిక్ ప్రాసిక్యూటర్ దుస్సేన్ పరిస్థితి. దారి చూపించే గురువులాగ దుస్సేన్ మీద భాస్కర్ కులకర్ణికి విశ్వాసం వుంది. అందుకే కేస్ తాలుకు పూర్వాపరాలు ఎప్పటికప్పుడు నిజాయితీగా దుస్సేన్‌తో చర్చిస్తూనే వుంటాడు. ఈ కేసుకి సంబంధించినంత వరకే కాని, జీవితంలో వారు ప్రత్యర్థులు కారు.

జరిగిందేమిటో తెలుసుకోవాలని భాస్కర్ భికూని ఎన్ని రకాలుగా అడిగినా భికూ పెదవి కదపడు. జరిగిందేమిటో చెప్పటంలో భయపడాల్సిన అవసరంలేదని, అవసరం అయితే దాన్ని రహస్యంగానే ఉంచుతానని, తను భికూకి సహాయపడే వ్యక్తేతప్ప శత్రువుకాదని ఎన్ని రకాలుగా భికూకి నచ్చచెప్పినా, భికూ పలకడు. భాస్కర్ భికూ వాళ్ళ వూరికి వెళ్ళి విషయం తెలుసుకుంటాడు.

భికూ భార్య నాగిని నలుగురు పెద్ద మనుషులు చెరిచి... చంపి....పాడుబడ్డ బావిలో పారేశారు. అధికారుల మద్దతుతో ఆ నేరాన్ని భికూ మీదకి తోసి సాక్ష్యాలు సృష్టించారు.

అంతా అయోమయం, దౌర్జన్యమయం.. ఎలా భికూని కాపాడ్డం.... చదువులేని భికూ ఎంత నిస్సహాయ

స్థితి వున్నాడో, చదువుసంధ్యలుండీ, న్యాయశాస్త్రం అధ్యయనం చేసి, నిజం తెలిసీ, తనూ అదే నిస్పృహాయస్థితిలో, వున్నాడన్న నిజం భాస్కర్‌ని మరింత కలతకి గురిచేసింది. ఏ కేస్‌నేనా కోర్టు నాలుగుగోడల వరకే పరిమితం చెయ్యాలనే దుస్సేన్ ధోరణి నుంచి భిన్నంగా భాస్కర్‌దృష్టిమారింది. నిజంనిరూపించటానికిఏదోదారి వెతకాలి అని భాస్కర్ తీవ్రంగా ప్రయత్నిస్తున్న సమయంలో కోర్టుకు వస్తుండగా దారిలో భికూతండ్రి మరణించటంతో విషయం తిరిగి అల్లకల్లోలం అయింది.

తండ్రి అంత్యక్రియలు జరపడానికి గూడెం వెళ్ళటానికి కోర్టు భికూని అనుమతించింది. తండ్రి చితి మంటల వెలుగులోనే భికూగొడ్డలితో చెల్లెల్ని నరికి చంపేయటం భాస్కర్‌కేకాదు అందరికీ గగుర్పాటు కలిగించింది. తండ్రి రక్షణ కూడా లేని చెల్లెలు జీవితం ఏమిటో, ఎలా హతమవుతుందో భికూకి తెలుసు.

భికూ మీద మరో హత్యానేరం కారణాలు అందరికీ తెలుసు. కానీ ఎవరికీ అక్కర్లేదు. ఏది న్యాయమో తెలుసు కానీ నిరూపించగలిగే సాక్ష్యాధారాలు లేకపోవటం వల్ల, కేసు దాచెయ్యగలిగిన శక్తులవల్ల న్యాయం ఎవరికీ అక్కర్లేదు.

ధనం, అధికారం రాజకీయ బలం కలిసి ఒక్కుమ్మడిగా జీవితాల్ని పీడిస్తుండగా, వ్యక్తిగతంగా ఎవరు ఎంత నిజాయితీగా ప్రయత్నించినా చేయగలిగిందేంలేకపోడం భాస్కర్‌ని కల్లోలపరిచింది. ఇంక ఆ సమయంలో మిగిలిన ఆధారం ఒక్కటే-పబ్లిక్ ప్రాసిక్యూటర్, తనకి గురుతుల్యుడు అయిన దుస్సేన్ సహాయం కోరటం.

దుస్సేన్ గిరిజనుడే అయినా ఆ సమయంలో గిరిజనుడు కాదు, అధికారం లేనివాడు కాదు, పేదవాడు కాదు.... అందుకే అంటీ అంటకుండా భాస్కర్ ప్రతి వాదాన్ని తోసిపుచ్చి ప్రతి మాటని నిద్రపుచ్చే ప్రయత్నం చేశాడు.

అంతవరకూ రేఖా మాత్రంగా వున్న భాస్కర్ సందేహాలన్నీ తీరిపోయాయి. తన చుట్టూ వున్న విలువలు ఎంత గొప్పవో అర్థమైంది. లాయర్‌గానేకాక వ్యక్తిగాకూడా తన బాధ్యత తెలిసిన వాడిలా భాస్కర్ అక్కడ్నించి కదలటంతో చిత్రం ముగిసింది.

మరొక విదేశీ చిత్రంతో కలిసి బంగారు నెమలిని గెలుచుకున్న ఈ చిత్రంలో అందరి నటన, కథ, సంభాషణలు, చిత్రీకరణ దేన్నీ విడదీసి చూడలేనంతగా కలిసిపోయాయి. 16 ఎం. ఎం. లో చిత్రీకరించి 35 ఎం. ఎం. లోకి బ్లో అప్ చేసి అద్భుతమైన ఫలితం సాధించిన గోవింద్ నిహ్లాని సాంకేతిక పరిణితి ఎందరికో ధైర్యాన్ని యిచ్చింది. సంభాషణలు సూటిగా, స్పష్టంగా సినిమా సంభాషణల రచనకి ఒరవడి పెట్టేవిగా వున్నాయి.

వి. రాజారామమోహనరావు.

Edited & Published by V. Leelavathy Raghavaiah, at 1-8-4/1/1, Chikkadpalli, Hyder bad-20 & by P. Ramakrishna Printed at Raghava Printers 1-8-4/1/1 Chikkadpalli, Hyderabad-500 020